# విభూతి

సంపాదకులు

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సారస్వత ధార్మిక మాసపత్రిక





ఖండము ౩ • శా ౧౮౬౩ వృష భాద్రపదము – సికింద్రాబాద్ • రేఖ ౨

Vol. 3. • 25th August 1941 – Secunderabad • No. 2



| సంవత్సర చందా | విడి సంచిక |
|---|---|
| ౨–౮–౦ | ౦–౪–౦ |

# విభూతి - విషయసూచిక

## వృష - భాద్రపదము





## చందాదారులకు

విభూతికి గతసంచికతో రెండుసంవత్సరములు గడచి మూడవసంవత్సర మారంభమైనదని పాఠకులకు దెలిసియే యున్నది. ౨ - 3 వత్సరముల నుండి చందాలు పంపని మహనీయులకు సూచనజేసి యుంటిమి గాని యింకను బహుసంఖ్యాకులు చందాను పంపలేదు. లేదా అక్కరలేదని జాబులనైనను వ్రాయలేదు. కాగితము ధర మూడు రెట్లు ఎక్కువగా పెరిగినను చందాను వెనుకటివలె సంవత్సరమునకు 2—8—0 లను మాత్రమే తీసికొనుచున్నాము. ఇకనైనను చందాలను పంపించి పుణ్యము గట్టుకొనవలెను. వి. పీల వలన అనవసరముగా నాల్గణాల పైకము అధికవ్యయ మగుచున్నది. మనియార్డరు చేయుటయే సులభమైన పద్ధతి. కొందరికి అనివార్యముగా ఈ సారి వి. పి. లు చేయవలసి వచ్చినది. వానిని తీసికొని ప్రోత్సహింతురు గాక!

మేనేజర్ 'విభూతి' —సికింద్రాబాద్.




సారస్వత ధార్మిక మాసపత్రిక

| పుస్తకము ౩ Vol. 3 | శా ౧౮౬౩ వృష భాద్రపదము—సికింద్రాబాద్ 25th August 1941—Secunderabad | రేఖ ౨ No. 2 |
|---|---|---|

# శతావధానభద్రపీఠము

సంపాదకుఁడుః చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు, శతావధాని.

[ఇయ్యది అష్టవధాన శతవధానములఁ బొనర్చి మహత్సభాంతరాళముల విద్వత్కవులచేఁ బొగడ్త గాంచి పరశురామ విజయము, రథాంగదూతము మొదలగు రసవద్దృశ్యశ్రవ్య ప్రబంధముల నిర్మించి యశ మార్జించి ముప్పది యేండ్లకే నూఱేండ్లు నిండి యాంధ్ర ప్రపంచమునకుఁ గొఱఁత గూర్చి చనిన కవి యువరాజు, బ్రహ్మశ్రీ రాళ్ళబండి వేంకట సుబ్బరాయశాస్త్రిచే వ్రాయఁబడినది.]

మ. శతసాధారణ ధారణాబల విరా◆జద్రత్న సోపాన సం
గతమై సత్కవితా సువర్ణఫలకా◆క్రాంతప్రకామ ప్రభా
తతమై పండిత సార్వభౌమభరణో◆ద్యత్కీర్తియై పొల్చు సం
స్కృతభాషాఢ్య శతావధాన విలస◆త్సింహాసనం బొప్పెడిన్. ౧

శా. ఆ సింహాసన మెక్కెఁ బ్రప్రథమమం ◆ దాశాంత విశ్రాంత కీ
ర్తి శ్రీ సావర్వధునీ తరంగ నిచయో◆ర్వీ సంచల న్నిర్మలో
ల్లాసాంభఃకణ శీతలీకృత మరు◆ల్లాలిత్య సంతుష్ట భూ
మీశుండై చళ్ళకొండ ధర్మకవి తా◆నేకాతపత్రంబుగన్. ౨

మ. అటు లప్పండితవీరుఁ డేలి చనఁగా ♦ నా సింగపుం గద్దెపై
భటరాజయ్యనుఁ బాండితీసతికిఁ బ్రా♦పై రామరాడ్భూషణుం
డటులే యెక్కెను వీరరాఘవ సమా♦ఖ్యుం బండితాఖండలుం
డటుపై నెక్కె ననంతరంబు గనెఁ బే♦రవ్వేంకటాచార్యుఁడున్. ౩

శా. పారంపర్యప్రవాహక్కు బూర్ణముగ సం♦పాదించుటంజేసి గీ
ర్ధారాపూర సమాత్తసేకకకుబా♦రామోత్థకీర్తిలతాం
కూరత్వప్రపరీమళ ప్రముదిత ♦ క్షోణీంద్రులై యెక్కి రిం
పారం దిర్పతివేంకటేశు లిపు డా♦ హైమాసనం బయ్యరే! ౪

శా. ఆ పాండిత్యప్రవాహక్కుతో నెగడు వి♦ద్యావంతులే కానియిం
కే పాకెన్నలు నెక్కఁజాలరుచుఁడీ! యెట్టెట్టులోయెక్క నా
టోపంబూనినఁ దెల్గువారలకుఁ జే♦టు ల్పాటిల్లున్ గల్గు సం
తాపంబే కవియొక్క పక్షమున ము♦న్నెవ్వెక్కెనో చూడుఁడీ! ౫

శా. పాండిత్యంబునఁ బొల్చు సత్కవుల నె♦వ్వండాగఁగాఁ జాలు ను
ద్దండప్రక్రియ శాస్త్రశస్త్రమును జే♦తం దాల్చి కబ్బంబులన్
గండండై సితకీర్తి చంద్రికలతోఁ ♦ గాళీకులాంభోధి చం
ద్రుం డక్కృష్ణకవీంద్రుఁ డెక్కుటకు ధీ♦రుల్సంతసం బందరే. ౬

ఉ. ఒక్క తెనుంగులోన నెవ♦రో మొనగాండ్రని వచ్చిరంట యా
బక్క కవీంద్రు లంటుపఱు♦పం గమకించెదరంట దాన నీ
దక్కదు మాట వారలకుఁ ♦ దత్కవులం బయికెత్తు వారికిం
దక్కదు దక్కదేటికి వృ♦థా వ్యవసాయము మానఁగాఁదగున్. ౭

మ. మొద లా సంస్కృత పాండితీ పరిచయ♦మ్మున్నంతగన్గోనియ
య్యదనం దెన్గునకూత మెక్కడిది య♦చ్ఛాంధప్రబంధమ్ముఁ గూ
ర్చెదమన్నన్సదలంక్రియానిచయము ♦ లీరీతు ల్గతు ల్కల్పనల్
గదుమ నార్వీక పట్టి తెల్గుతెగులై ♦ కాటించు నెవ్వారినే. ౮

సీ. చలికొండ ధర్మన్న ♦ సాహసించెనె పూర్వ,
మొక్క తెనుంగుతో ♦ నెక్కుటకును
వీరరాఘవసుక♦విద్విపంబెక్కెనే,
తెలుఁగుమాటలనె కే♦వలముదాల్చి
భట్టుమూర్తియు నెక్కఁ ♦ బట్టుబట్టెనె మున్ను
తేట తెల్గుపదాల ♦ పాటఁబాడి

వేంకటాచార్యకవిప్రభుం డెక్కెనే,
యాంధ్రపదాల నోరార వాగి
లలితతరసంస్కృతకలావిలాసకాన
మానసాహిత్యకౌశల శ్రీనిధాన
నవశతవధాన భద్రాసనం బదేడఁ,
దెలుఁగువారెక్కు టేడ నీ తెలివియేడ.

శా. అంటుంగూర్తురు తెల్గువారనుచు నీ వారాటముం జెందకో
ఘంటాకుంత శతావధాన విలస ద్గాంగేయ పీఠంబ! ని
న్నంట న్వచ్చెడు వేళలం దగరు మీ రా మూల మృద్వేదిపై
నుంట ల్మంచిదటంచుఁ బల్కిరటుపై నున్నారు పల్కం బుధుల్. ౧౦

శా. అమ్మా! సంస్కృతమా! మనమ్మనను దైన్యంబందఁ బోకమ్మ లో
కమ్మందుం గవులైన యెల్లరును నీకమ్మందన మ్మానఁగా
నెమ్మెఁ గూర్చెదరే మహాకవులకో యీ కీర్తి యింకొక్క మా
టమ్మా! శుంఠలు నిన్నుఁగానమియ మేలౌనంచు నెంచందగున్. ౧౧

# నిజాం ప్రాంతీయ వీరశైవ పరిషత్తు

## నాల్గవ అధివేశనము

ఇదే వృషసం. భాద్ర. శు. ౧౫ మొదలు బ. ౧. ౨లు (5-6-7 సెప్టెంబరు 1941) శుక్ర, శని, ఆదివారములలో హైదరాబాదు నగరమున నిజాంప్రాంతీయ చతుర్థ వీరశైవ పరిషత్తు మిక్కిలి వైభవముగా జరుగగలదు. కొన్ని వేల మంది యిందు పాల్గొన గలరని యూహింప బడుచున్నది. ఆహ్వాన సంఘప్రయత్నములు జోరుగా సాగుచున్నవి. ప్రభుత్వమువారి యనుమతి లభించినది. ఇందు ప్రత్యేకముగ శిక్షణపరిషత్తు; మహిళా పరిషత్తు అను సభలుకూడా గొప్పగా జరుగనున్నవి. మహామహుల దర్శనమును ప్రముఖుల యుపన్యాసములును ఈ మహానగరమున లభింప నున్నవి. సమస్తాంధ్ర మహారాష్ట్ర కర్ణాటక వీరశైవ సోదర సోదరీ మణులు ఎక్కువ సంఖ్యగావచ్చి పాల్గొన గోరుచున్నాము. ఆహ్వాన సంఘసభ్యుల రుసుము ౧౦. రులు. సభ్యులరుసుము ౫ రులు. ప్రేక్షకులు ౩రులు, ఎల్లరకు భోజన వసతికలదు—వలయువారు; వ్రాయుడు.

కార్యదర్శి:—నిజాం వీరశైవ పరిషత్తు
లింగంపల్లి, హైదరాబాదు దక్కన్.

# పితృపక్షము; శ్రాద్ధములు

"విద్యానిధి"

హిందువులందరును చిరకాలమునుండి యాచరించుచున్న శ్రాద్ధములు, తర్పణములు, సాంవత్సరికములు, పుణ్యతిథులు, తద్దినములు, ఆరాధనలు మున్నగు వానిని గూర్చి యాధునికులలో కొందరు విపరీతమైన యభిప్రాయములు గలిగియున్నారు. మరి కొందరు వేదశాస్త్రాదులలో నివి నిరూపింప బడలేదనుటకును వెనుదీయుటలేదు. ఈతత్త్వమును గూర్చి ప్రస్తుతము విజ్ఞాన (సైన్సు) పద్ధతితో యథాశక్తి యించుక వివరింపబడుచున్నది.

చనిపోయిన పెద్దలను గూర్చిన శ్రాద్ధపద్ధతి ప్రపంచమందలి సకల మతములలోను ఏదో యొక రూపమున నున్నదని సహజముగ గ్రహింపవచ్చును. అందు హైందవుల పద్ధతి మిక్కిలి విశదముగ నుండును. యూరపుఖండమునను దీని యస్తిత్వమును గనుగొనిన విజ్ఞాన వేత్తలు పరిశోధనల గావించి "శ్రాద్ధముల నాచరింపనిచో చాల త్వరగా ప్రకృతి నశించి పోగలదని ప్రకటించి యున్నారు. థార్ లేటింగ్ అను మహావిజ్ఞానవాది తన "పేటర్ బుక్కింగ్" అను లాటిన్ భాషా గ్రంథమున "జ్వేరింగ్ వెరింటర్ పేటర్ డేరిస్ట్ శ్రాద్ధాస్" అనెను. పితరులు చనిన వెనుక శ్రాద్ధమార్గమున పితౄణమును దీర్పవలసియుండునని దీని కభిప్రాయము. వేదార్థముల నభ్యసించు గురుపరంపరా పరిపాటి యిటీవల భారతదేశమున సన్నగిలుచుండుట వలన హిందువులయొక్క వివిధాచారముల లోని విజ్ఞాన తత్త్వముల ప్రవచించువారు కొరవడినారు. మీదు మిక్కిలి వైదిక వాఙ్మయ గంధము లేనివారు సైతము శాస్త్రసిద్ధాంతములను చులుకనగా తూలనాడుచున్నారు. ఇది చింత్యము కదా!

ప్రతి శరీరమున విజ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ యని ఆత్మ ముత్తెరంగుల నున్నది. గర్భాధానముకంటె పూర్వము స్త్రీపురుషులలో సంభోగేచ్ఛను గలిగించునది విజ్ఞానాత్మ యనబడును. ఇది రోదసీమండలమునుండి యాగమించుచున్నది. ఈ మండలము పృథ్వికి ౨౭ వేల మైళ్ళ దూరమునగలదు. చంద్రలోకమునుండి పురుషుని శరీరమున ౨౮ అంశాత్మక రేతస్సుగ బ్రవేశించునది మహాత్మ యనబడుచున్నది. ఈ ౨౮ అంశముల రేతస్సుతోడనే పురుషుఁడు పుత్రుని గనుచున్నాడు. మాతవలన దినబడిన అన్నరసమునుండి యేర్పడిన వాయుద్వారా గర్భపిండమును ప్రవేశించునది భూతాత్మ యనబరగుచున్నది. ఈ వాయువునందు అహంభావముయొక్క తెలివి గలుగుచున్నది. దీనికే ప్రజ్ఞానాత్మ యను వేరొక పేరుగలదు. ఈ భూతాత్మ భూమిలోదక్క తక్కిన యేలోక

మునను ప్రవేశింపదు. మనుష్యుడు మరణించగానే వాని మహాత్మ స్వకీయమగు చంద్రలోకమును చక్కగా ప్రవేశించును. ఆ లోకమునగల అంభఃప్రాణులు మహాత్మనుండి ౧౮ అంశముల రేతస్సును గ్రహించును. కారణ మేమనగా చంద్రలోకమునుండి ౧౮ అంశముల గ్రహించికదా మహాత్మయుద్భవించినది ! ఈ ౧౮ అంశముల రేతస్సునకే పితృఋణమని పేరు. ౧౮ అంశముల రేతోరూపమగు శ్రద్ధామార్గమునుండి పంపబడు పిండము, అన్నము, జలము మున్నగువానినే శ్రాద్ధమని పిలువబడినది. ఈ శ్రాద్ధ నామకమైన మార్గముయొక్క సంబంధము మధ్యాహ్నకాలమున పృథ్వితో గలుగుచున్నది కావున శ్రాద్ధములు మధ్యాహ్నమున జేయుటకు విధింపబడి యున్నవి. సరిగ నాకలి అపుడు మాత్రమే కలుగును కావున తృప్తికిగూడ నది సుసమయ మనుట లోక విదితము.

ఆ ౧౮ అంశముల రేతస్సును చంద్రమండలమునకు బంపని యెడల ప్రకృతి నాశమే సంభవించును. లేక విశ్వసంచాలన సామగ్రిలో నొక సంపూర్ణమైన కళయే నష్టము గావలసి యుండును. అగ్ని మరియు సోములనుండియే సృష్టి యగుచున్నట్లు వేదములు సిద్ధాంతించు చున్నవి. మీకు గనుపడు సమస్త వస్తువులలోను అగ్న్యంశ జలాంశములే ఎక్కువగా కలవు. అగ్ని తనలో బడవేసిన వస్తువులో నుండి తన యంశమును తాను గ్రహించు చున్నది. అనగా కాలిపోవుచున్నది. నల్లగా మిగులు మసియే జలాంశము. ఈ విషయమును గూర్చియే పై జర్మన్ పండితుడు "వేటర్ సంలాస్ విహోలియన్ నేచర్ హుజ్వియన్" అనెను. ప్రకృతికి అగ్నిజలములు భుజము లనదగును. అనగా సూర్య చంద్రమండలములకు సంబంధించినవియే అగ్నిజలము లనియును, వాని నుండియే విశ్వమందలి వివిధ వస్తుజాలము సిద్ధమగు చున్నదనియును దెలియవలెను. వేదభాషలో సోమ, జల, రేతస్ మున్నగు పారిభాషిక శబ్దములు ఒకే యర్థము నిచ్చుచున్నవి. ఒక దినమున వేలమంది పుట్టుచున్నారు గదా యనుచో అన్ని వేల ౧౮ అంశముల రేతస్సే పృథ్వికి ప్రతిదినము రవాన యగుచున్న దనవలెను.

ప్రాచీనాచార్యులు, మహర్షు లీ తత్త్వమును గమనించి చంద్రుని నుండి మనకు లభించు నంతటి రేతస్సును (సోమమును) మనమును శ్రద్ధామార్గమున చంద్రలోకమునకు బంపవలెనని నిశ్చయించిరి. అప్పిచ్చువారికి మరల నప్పులవారందరు చెల్లించిననేకదా వాడు ధనవంతుడుగానుండి మరల అప్పునీయగలడు ? చంద్రునికి సోమాంశమును చెల్లింపనిచో సృష్టి శక్తి తిన్నగా తరిగిపోగలదు. ఋషులు ప్రపంచమును చక్కగా అన్వేషించియే సోమాంశము ఎక్కువగా గల తండులములు, యవలు అను ధాన్యములను గనిపట్టిరి. ఇతర ,యే వస్తువులలోలేనంత చంద్రాంశ మీ ధాన్యములలో విశేషముగా నున్నది. పృథ్వియందు స్థూలములైన నదులు ప్రవహించుచున్నట్లు సూక్ష్మమైన సోమనదియు అగ్నినదియు పారుచున్నవి. అగ్నియొక్క గమనము దక్షిణమునుండి యుత్తరదిశవైపు

కలదు. సోముని గమనము ఉత్తరమునుండి దక్షిణపువైపుండును. కారణమేమనగా పృథ్వి మీద అగ్నియొక్క కేంద్రస్థానము దక్షిణమువైపుకలదు. సోమము (జలము) యొక్క స్థానము ఉత్తరాఖండమైయున్నది. అందుకనియే అగ్నిగతి దక్షిణమునుండి యుత్తరమునకును, సోమగమనము ఉత్తరమునుండి దక్షిణమునకును కలదు. ప్రపంచ మందుగల సమస్త అన్నధాన్యములును చేలలో దక్షిణపూర్వము లేక పశ్చిమమునుండి పండును. కాని వడ్లుమాత్రము ఉత్తరమునుండి పక్వమగుట కారంభమగును. (ఇది సూక్ష్మగ్రాహులైన కృషీవలులకు దెలియు విషయము) క్షేత్రము (చేను) లోని సోమాంశమైన జలము ఉత్తరమునుండి దక్షిణమువైపు సూక్ష్మముగా ప్రవహించుచుండును. కావున నీరుపెట్టుట ఆపినపుడుగాని, పరిపక్వస్థితికలిగి నీటిని ఆకర్షించుట యాగిపోయి నపుడుగాని యుత్తరమునుండియే ఎండునని భావము. ధాన్యము లన్నిటిలో జలముమీదనే ఎక్కువగా ఆధారపడి పండునవి వడ్లుమాత్రమే యననగును. ఇవి జలము ఎంత సమృద్ధిగా దొరకిన నంత యెక్కువగా పండు నను విషయమును ప్రత్యక్షము. కావున సోమమును, వడ్లును, పరస్పరముగా సజాతీయాంశము గల్గియున్న వనవలెను.

యవల స్థితివిశేషముగూడ నిట్టిదియ. వైదిక యజ్ఞములలో జేయబడు పురోడాశము (ఈ శబ్దమె నేడు ఒక విధముగ పూరీయైనది) సుప్రసిద్ధము. దీనియొక్క మేధాస్థానమున యవలచూర్ణమే (పిండి) వినియోగింపబడును. ఇట పురోడాశ మనగా యజమానుని శిరస్సు, శిరస్సులో మేధ (బుద్ధి) యుండవలెనుకదా ! యవలలోని మేధాభివర్ధన శక్తిని మహర్షులు పరిశోధించి విజ్ఞానము ద్వారా తెలిసికొనినా రనవలయును. (గోధుమరొట్టెనుమే ముపయోగించుచునే యున్నాము. మాకు దెలియు నందురేమో ! ఇది నేటి విషయము కాదు. వేల సంవత్సరములకు పూర్వమున నెంత ఘనముగ కష్టించినచో తప్ప యిది ప్రచారమునకు రాలేదు.) మేధా, సోమ శబ్దములు కూడా ఒక విధముగ పారిభాషికము లైనను పర్యాయము లని చెప్పవలెను. యవలందలి యధికమైన రేతో (సోమ) భాగమును దెలిసికొనిన మహర్షులు ఇది చంద్రుని వరకు వెళ్ళుట యెట్లని చింతింపదొడగిరి, చంద్రమండలము పృథ్వికి ౨౨ వేల మైళ్ళ దూరమున నున్నదికదా! సూక్ష్మవిజ్ఞాన చర్చతో "భాద్రపద కృష్ణపక్షమున [ఉత్తర దేశ గణనలో ఆశ్వయుజ కృష్ణమున] తండులముల, యవల, పిండముల దానమిడుచో ౨౮ అంశముల రేతస్సు చంద్రలోకమునకు జేరు"నని మహర్షులు నిశ్చయించిరి. (ఇక్కడ నింకొక యంశమును గమనింపదగియున్నది.) భాద్రపద బహుళ అమావాస్యతో వర్ష ఋతువు పూర్తియయి చంద్రాంశమగు జలప్రవాహము ఆగిపోక మున్నె చంద్ర తర్పణ రూప మగు పిండమును భా. బ. లో సమర్పింపవలెనని భావము) వైదిక సిద్ధాంతానుసారము పృథ్వి నడచుచున్నది. సూర్యుడు స్థిరముగా నుండును. చంద్రుడును చలనము గలవాడే ! సూర్యుని నలువైపులు పృథ్వియును, పృథ్వికి నలువైపుల చంద్రుడును దిరుగును. ఉత్తర ధ్రువమునుండియే ఈరెంటి చలన

మారంభమగుచున్నది. సృష్టియొక్క ఆరంభమందలి యే కార్యమైనను ఉత్తరధ్రువము నుండియె మొదలగును. (ఇక్కడ ఈ చర్చ రావచ్చును:—ఆర్యుల సృష్టిగూడా ఉత్తర ధ్రువమునుండి యారంభమై మధ్య ప్రాచ్యములద్వారా వారు భారతదేశమును ప్రవేశించి యుందురు. దక్షిణమున ద్రవిడజాతియొకటె పురాతనముగా నున్నట్లు సిద్ధాంతము కాగల దని భయపడ నవసరము లేదు. అసలు సమస్తమానవ సృష్టియే ఉత్తర ధ్రువము నుండియైనపుడు దక్షిణమున ద్రవిడులకు సంభవమే లేదు.)

చంద్రుడు తిరుగుచు తిరుగుచు భాద్రపదబహుళ పాడ్యమి మొదలు అమావాస్య వరకు సూర్యునికి క్రిందుగా పృథ్వికి పైగా దగ్గరకు వచ్చుచున్నాడు. చూచుటకు చంద్రుడు పైగా దూరముగా అగుపడుచున్నను, చంద్రుని వాసము పృథ్వికి అధోభాగమున నున్నది. కారణ మేమన అగ్నియొక్క జ్వాల (మంట) ఊర్ధ్వముఖముగానే వెడలు చుండును. అగ్నియొక్క కేంద్రస్థానమగు సూర్యుడు మీద నున్నాడుకదా! స్వజాతి వైపుననే ఆకర్షణ జరుగుట సుప్రసిద్ధము. జలమును మీదికి ఎగజల్లినను వెళ్ళజాలదు. జలకేంద్రమగు చంద్రుడు పృథ్వికి గ్రింద నున్నాడు. పృథ్విమీద వర్ణింపబడు చంద్రుడైతే సూర్యునికంటె ౨౨ కోట్ల మైళ్ళమీద నున్నాడు. ఆ చంద్రుని బ్రహ్మణస్పతి, పరమేష్ఠి యని కూడా వ్యవహరించుటకలదు. మనకు గనుపడు చంద్రుడు అంభశ్చంద్రు డనబడు చున్నాడు. పితరులును ఇందే యుందురు. ఇదియే ఉత్తర ధ్రువమునుండి తన గమనము నారంభించును. చంద్రుని రశ్మి అధోముఖముగా ప్రవహించునట్లే ఊర్ధ్వముగను ప్రకా శించును. మరియు చంద్రుని స్థితి చక్రము నాధారము జేసికొని యున్నది. చంద్రునిలో కేవలము జలము మాత్రమె కలదు. పితృప్రాణ మగు మహాత్మగూడ ఇందే యున్నది. చంద్రునియందుగల కేంద్రస్థానమునుండి పైకి ప్రసరించు రశ్మితోబాటు ఆ పితృ ప్రాణము లును వ్యాప్తమై యుండును. ఆ భాద్రపద బహుళ పాడ్యమి మధ్యాహ్నము పైకి వెడలు రశ్మి చక్కగా పృథ్వివైపునకే రాగలదు. చంద్రుడు ధ్రువమునుండి దక్షిణమందలి విశ్వజిత్తారకు సమ్ముఖముగా ప్రయాణించు నప్పటినుండియే చంద్రచక్రము అడ్డముగా దిరుగు చుండును. ఇట్లు తిరిగి తిరిగి సరిగా భాద్రపదబహుళ పాడ్యమినాటికి పైభాగము క్రిందికిని, క్రిందిది పైకిని యగునట్లు స్థితుడగుచున్నాడు. ఇది విశ్వజిన్నక్షత్రమునకు సమీపగతుడైననాటి విషయము. అపుడే చంద్రుని యుపరిభాగముననుండిన పితృప్రాణ ములు చంద్రరశ్మితోబాటు తలక్రిందులై పృథ్విని ప్రవేశించుచున్నవని వేరే వ్రాయ నవసరము లేదనుకొందును.

భాద్రపద బ॥ ౧ నుండి అమావాస్యవరకు ఆ సోమరశ్మితోబాటు పితృప్రాణములు వ్యాప్తమై యుండును కావున, ౨౮ అంశముల రేతస్సుకొరకు చంద్రలోకమున దిరుగుచు నా పితృప్రాణములు అంభఃప్రాణముల జతతో సంబద్ధములై తమ పరివారసమూహము

నకు సమ్ముఖము లగుచుండు ననుట యెంతయు సమ్మతము. పితృపక్షమునందు జేయబడు తర్పణాదులతో నా పితృప్రాణములు స్వయముగ ఆప్యాయితములై యుండును. జలమున సోమాంశము కలదు. పితృప్రాణములుకూడ సోమాంశమే కద! జాతిలో జాతిగలియ నిచ్చగించుట స్వాభావికము. పితరుల పుత్రులు, లేక దాయాదులు శ్రద్ధతో సమర్పించు నట్టి యవతండుల పిండములనుండి రేతోంశముల పితృప్రాణములు గ్రహించి చంద్రలోక మందలి అంభఃప్రాణులకు జెల్లించును. ఈ ౧౫ దినములకే పితృపక్ష మని పేరు.

ఆశ్వయుజ శు ౧ నుండి యీ చక్రము మరల పై వైపున కేగుచుండును. దీనితో బాటు పితృప్రాణములు గూడ నుండునను విషయము మరువదగినది కాదు. ఈ రశ్మికి శ్రద్ధా యను మరియొక నామము కలదు. ఇతర సమయము నందు జేయబడు శ్రాద్ధ తర్పణములను సూర్యునియొక్క సుషుమ్న నాడీద్వారా పితరు లందికొను చున్నారు. ఆ శ్రద్ధారశ్మి సహజముగ మధ్యాహ్న కాలమున పృథ్వికి వచ్చి పితృభాగమును గొను చుండును. కాని పితృపక్షమున నున్నన్ని చాంద్రాంశములు గాని, పితృప్రాణములు గాని చంద్రచక్రము కదలిన తరువాయి ఇతర మాసములలో పృథ్విలో నుండవని తెలియునది. కావుననే ఈ పితృపక్షమునకు మాహాత్మ్యము కలిగి మహాలయ మనిపించు కొనినది. జర్మనిలోని టుబింగన్ నగరమున పితరులను గాంచు యంత్రము నిర్మింపబడినట్లు విని పది వత్సరములు గడిచినవి. కొంత కాలమున కది భారతీయులకును ప్రత్యక్షము కావచ్చును. యంత్రములద్వారా చూచినపుడైనను గత పితరుల గాంచగలమేమో! కాళిదాస మహాకవి చెప్పినటులు నోరు దెరచుకొని మన శ్రాద్ధపిండముల నిరీక్షించు పితరులు కలరేమో! ఇట్టి విజ్ఞానముద్వారా తెలిసికొని యైనను బ్రతికినవారికి శ్రాద్ధ ముల బెట్టదలచుకొనిన సమాజ సోదరులు సమాధానమనస్కు లగుదురుగాక! శైవ వైష్ణవ స్మార్త భేదమునుబట్టి ఈ శ్రాద్ధములకే ఆరాధనలు, పుణ్యతిథులు, అర్చనలు మున్నగు నామములతో కొన్ని విశేషములు గలిగియున్నవి. శివాగమస్మృతి పాంచరాత్రముల వలన నాయా సంప్రదాయముల నెరుంగునది.

ఈ ప్రతిపాదిత విషయములనుగూర్చి శ్రుతి స్మృతి శతపథాది గ్రంథములలో చాలా ప్రమాణములు కలవు. యథావకాశము నివేదింపబడును.



# వసంతోత్సవము

శ్రీ విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రిగారు

నిదుర విడనాడి కోమలీ ! కదలిరమ్మ; వికసితోదయకాలంబు వింత రంగు
లీను ఱెక్కలఁ దరుణుఁ డా భానుదేవుఁ బ్రీతి నర్పించుచున్నదో నాతి! నేఁడు;
సుదతి ! పవమానముఖమున నుదయలక్ష్మి సవితృదేవుని చిత్రాంశు నివహ మెట్లు
వెలయఁజేయుచు నున్నదో వెలఁదిచూడు ? లెమ్ము; సోమరితన మేల కొమ్మనీకు !
తుహిన పాతాన మెఱసెడి బహుళపాదపావళియు, లేత మొల్కలు చేవదేఱి
యెటుల వెలుగొందుచున్నవో యింతి గనుము! ప్రసవగుచ్ఛంబు లెల్లడ బాష్పకణము
రాల్చుచుం దూర్పుదెస నుంత వాల్చె మేను; సెజ్జ విడనాడి వేవేగ సజ్జిత వయి
ఏల కై నేసికొన వింక జేల నీవు ! శకునసంతతి ప్రార్థనల్ సలుపుచుండ
భవనమున డాగియుండుట పాడియగునె? కాక, దైవాజ్ఞ మీఱుటగాదె సకియ!
తోడినెచ్చెలు లెల్ల సంతుష్టమతుల, భరతపక్షికి మున్ముందె పాన్పు వీఁడి
శ్రీ వసంతునిఁ బులకిత హృదయు లగుచు, స్వాగతము లిచ్చి తోడ్తేఱఁజనెద రదిగో !

౨

ప్రియతమా! లేచి దుస్తుల వేగదాల్చు, మభినవ వసంతుమాడ్కి నాహ్లాదమునను
నవనవోన్మేష సంపద నటనసేయ, వేగ దుస్తుల్ గై నేసి వెడలిరమ్మ
కురుల ముడువంగ బహువిధాభరణరాజి, గూర్ప మితిమీఱు శ్రద్ధగై కొనఁగఁబోకు
భీతి నీకేల! పత్రాళి ప్రీతిమెఱయ, ముత్తెములఁజల్లు నీమీద బత్తితోడ
ఉడుగరలు నీ కొసఁగఁగ నుదయలక్ష్మి, కోలఁది ముత్యాలపీడక కూర్చియుంచె;
ప్రొద్దుపొడువకమున్నె యే బద్ధకంబు, లేక వెడలికై కొమ్మ వితాకు వీడి;
పొడుపుమలపయి దినమణి బడలువాయ, గదలకుండఁగ నీరాక కెదురుచూచె;
గాన, వదలక జలకంబు తోనదీర్చి, తాల్చి యుడుపుల వేవేగఁ దరలిరమ్మ
అధికతరప్రార్థనలు స్వల్పబుధులు మెచ్చ, రంబుజాక్షి వసంతోత్సవంబునందు;
నల్పసంస్తుతు లొసగు ననల్పఫలము.

౩

ప్రేయసీ ! చూడు చేలెల్ల వీధులయ్యె; జిగురకొమ్మల లతలను జిత్రరీతి
బాగముస్తాబుగావింపఁ బడినవీథు లెట్లుపవనంబులయ్యెనో యింతిగనుము;

గేహగేహంబునకు భక్తి బాహటముగ, శాఖలే రీతిఁ! గీల్కొల్పఁ జాన చూడు:
ప్రఘణసందోహము కవాటపంక్తులెల్లఁ బటకుటీర నాకాతతిపగిదిఁ జెలఁగె;
కంటకావృతగుల్మ శాఖాళి పత్రి, సంతతి విటాళి కింపగు చాయలట్లు
అల్లిబిల్లిగ నల్లె నో పల్లవోష్ఠి, ఇట్టి యానందవారిధి చుట్టుముట్టి
చక్కనగుచేలపొంత బజారులందు వెల్లివిరియుచునుండఁగఁ జెల్లనీవు!
ఏల తిలకింపవమ్మ ప్రాల్మాలుపీడి! ఉవిద! వెడలుద మీ వసంతోత్సవంబు
కనులకఱవుదీఱఁగఁ గాంచు మనసుతోడ; ఇంకలోపల మసలిన శంక లేక
పాపముం గట్టుకొందువు పద్మనయన! రమ్మ వేవేగఁ బోద మోకొమ్మ! నవ్య
మధురమధు వాసనోత్సవ విధులఁ దీర్ప.

౪

ఉత్సవంబునఁ బాల్గొన యువతి యువక, బృందమున నొక్కడైనను బీరువోక
నిలయములపీడి యేగిరి కలసిమెలసి; అదిగొ! తరుణులు కొందఱు ముదితహృదయ
లయి, కరంబుల లేమొల్కలంది కొనుచు, వచ్చుచుండిరి యొండొరుల్ మెచ్చుకొంచు;
కండ్లు తెఱవక మున్నెన్ని పండ్లురొట్టె లారగించిరి బంతులగూరుచుండి;
తరుణదంపతులన్యోన్య తరళదృష్టి, మాలికలఁ బంపి మోదానఁ దేలుచుండ్రి
పరిణయోత్సవతంత్ర నిర్వాహణమునకు నేర్పరించుకొనిరి పురోహితగణంబు;
ప్రేమపూత కటాక్షమాలికలు, చతుర దౌత్యముం జేసె నవయువ దంపతులకు;
మురిపెమున నిఱికౌగిటఁ గరఁగి కరఁగి ముద్దుతరఁగల దేలెడి మోహియుగళి
బంగరుంబాలియ మెల్లను దుమ్రింగిపోక, మున్నె సౌఖ్యాబ్ధినోలాడి, కన్నుబ్రామ
వార్ధకం బజ్జవెట్టని పట్టునందె, అసువులను వీడుదము ప్రియా విసుగువీడి!
బుగ్గలంబోలు మనుగడ పూవుబోఁడి; కమలబాంధవు గతిమీఱి కాలమెల్లఁ
బరువులెత్తెడుఁ గాదె యే వెఱపులేక! ఊష్మహిమమనుఃలవడువున హాుష్ణమనుచు
గతదినములెల్లఁ బంచబంగాళమగును; కానఁ గాంతరొ! పాటలుఁ గతలలోన
చేరియుండక మున్మున్నె కోరికోరి, అమలసౌహార్ద డోలికలందు నూగి
ధన్యజీవుల మగుదమో తన్వి మనము! సమయమేగక మునుపె యోరమణి! మనదు
బొందెలం బ్రాణములు వోకమున్నె, వెడలుదము వసంతోత్సవము సల్పఁ బ్రమదగతిని.

(మాతృక Harrik గీతమాలిక)



# కాలతత్త్వము —(?)—

శ్రీ ఆంధ్రవ్యాస నిపుణ, అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు

ప్రాచీన కాలమునందొక యరణ్యమునందుఁ దపోనిష్ఠయం దగ్రగణ్యుఁడగు మాధవశర్మ యను భూసురుఁడు కలఁడు. అతఁడు నిత్యము భగవద్ధ్యానమునందును, తపమునందును, శ్రద్ధ వహించుచుండువాఁడు. ఇట్టి కారణములచేతఁ దల్లిదండ్రులాతనికి వైవాహికముఁ జేయక, బ్రహ్మవిచారణ చేయుచు జన్మను పునీతమొనర్చుకొనుమని యాజ్ఞాపించిరి. మాతాపితల యానతి ననుసరించి యావిప్రుఁడు బాల్యమునందే విపినముంజేరి గురువు చెంగట యోగముల నన్నిఁటిని గ్రహించి మననముంజేయుచుఁ దపోనిష్ఠయం దగ్రగణ్యుఁడై సాటివారలలో నౌరా యనిపించుకొనెను.

మాధవశర్మ ప్రతినిత్యము త్రికాలములయందుఁ గాలక్రియల నిర్వర్తించుచు భగవత్కరుణ ప్రాప్తికి సాధనమైన వేదాంత విద్యను సమగ్రముగ మననము చేయుచుండువాఁడు. యోగముల నభ్యసించి తద్ద్వారా చిన్ముద్రలను పట్టుచు యోగాగ్నిచే శరీరమును తపింపఁ జేయును. కాలమునకు సమస్త ప్రాణికోటియంతయు దాసోహమ్మనుట సాజము కావున నీతఁడును కాలమూర్తికి వశ్యుఁడే యని వేర నుడువనేల ?

ఇవ్విధమునఁ జాల కాలమేఁగెను. ఒకానొక దివసమున కాలమునకు వశ్యుఁడైన మాధవశర్మకుఁ గాలతత్త్వమెట్టిదను సందియము వొడమెను. వెంటనే విచారణకుం గడంగినవాఁడాయెను. తపమొనర్చువాఁడొక్కఁడే యుండును గావున నితరులతో నీ విషయము జెప్పి సందేహనివృత్తిచేసుకొనుటకు వీలుపడదయ్యెను. మఱియొకఁడున్నఁగదా ప్రశ్నించుటకు ? అతఁడు సందేహహృదయుఁడై యివ్విధమున తర్కింప జొచ్చెను.

కాల మెవని స్వరూపము ? కాలమున కాద్యంతములు కలవా? కలవు. ఉదయాస్తమయములే యాద్యంతములా ? కావు. కాని యెడల యుగములు గతించుటేనా ? కాదు. కానిచో కాలమున కాద్యంతము లెక్కడివి? లేవు. ఉన్నదను శబ్దము వ్యర్థమేగదా ! సర్వము కాలాధీన మనుటయు నిరర్థకమే. కాలమయుం డీశ్వరుఁడనుటయు నంతకుఁ బూర్వమే పూజ్యము. అట్టితఱి కాలస్వరూపుఁడని చెప్పఁబడుచున్న భానుమూర్తి కర్ఘ్యాదు లొసంగుట నిష్ప్రయోజన మనక తప్పదు. కర్మలొనర్చుట; తద్ద్వారా లోకాంతరములని యాసతో నుండు టడియాసలు కాకతప్పవు.

సర్వము మిథ్య కానిపక్షమున కాలస్వరూపుఁడెవ్వఁడు? అతని స్వరూపమెద్ది? నామవాచకములెవ్వి? నిర్గుణుఁడా? సగుణుఁడా? సగుణుఁడైన కన్పింపడేల? భాషింపడేల? సగుణుఁడు కాఁడు. నిర్గుణుఁడే యగును. నిర్గుణత్వము కలవానికి సగుణత్వ మారోపించుట లేని

దానిని యున్నదని భ్రమించుటయేగదా? భ్రమ నివృత్తి లేదనుకొనుటయే యుత్తమ మార్గము. ఉన్నాఁడనుటయే భ్రమ. లేఁడనుటయే నివృత్తి.

కాలమూర్తియని చెప్పఁబడు వాఁడు చేయుచున్న పనులెవ్వి? అతఁడెచ్చోట నుం డును. ఏయే పనులను చేయించును? అతనికి ప్రధానమైన పనులెవ్వి? కింకరులెవరు? ఇవ న్నియు సందేహపరంపరలు. కాలస్వరూపుఁడని చెప్పంబడువాఁడు కదలఁడు; వినఁడు; చూడఁడు. అతనికి నామరూపములులేవు. ఏ పనులను చేయించుటలేదు. కింకరులు లేరు. గమ్యస్థానములులేవు. సర్వము భ్రమయే.

భ్రమకాదని సిద్ధాంతమొనర్చిన కాలతత్త్వ మిట్టిదని దృగ్గోచరము కావలయును గదా! అట్టిదగుచున్నదా? లేదు. ఇఁక తత్త్వము నిస్తత్త్వమేయగును. లేనియెడల ప్రాత ర్మధ్యాహ్న సాయంకాలములే కాలమైన, చెల్లిన యుగములు, రానున్న యుగములుకాలమే యని యేల తలంపరాదు? అటుల భావింపవచ్చునా? వీలులేదు. ఎందుచేత? ప్రకృతి స్వభావమువలన కలుగుచున్న నీమార్పులను కాలమున కంటగట్టుట లోకవంచన మగుట చేత. ఇయ్యది సిద్ధాంతమేయగునా? లేదను పూర్వపక్షమేది? ప్రత్యక్ష ప్రమాణము హేతువు కావచ్చును. ప్రత్యక్షమనఁగా ప్రకృతికి స్వతస్సిద్ధమగు మార్పులేనా?

ఇంతకుఁ గాలమను దానికి లింగము కలదా? ఏలింగము? పుంలింగమగునా? కాదు. స్త్రీలింగమగునా? కాదు. ఇఁక నపుంసకలింగమే శరణ్యమా? అట్టి జాడయు గోచరింపదు. ఏ లింగము కానిపక్షమున, నెవ్వఁడు యధిపతి కానియెడల నిఁకఁ గాలమనఁగా నర్థమేమి? కాలమనఁగా సంహారమని యర్థమా? కాదు. సృష్టియని కలదా? లేదు. స్థితియని యున్నదా? గోచరింపదు. కావునఁ గాలశబ్దమున కర్థమేలేదు. తాత్పర్యములేనిదానికి తత్త్వ మెక్క డిది?—ఉన్నదా?

ఇవ్విధమున ననేకసంశయములతోఁ డోలాయమానమానసుఁడై మాధవశర్మ విచా రించుచు నింగి వైపు తలయెత్తెను. ప్రాతఃకాలము దాటినది. మధ్యాహ్నము జరుగు చున్నది. అంతవఱకును స్నానము చేయలేదు. ఏదోయొక విధమగు చెడునకో, మంచికో యలవడిన ప్రాణు లా కాలమునకు సరిగా నట్టి పనులవైపుఁ బర్వెత్తుట సాజము. అట్టి పనికే యలవడిన శర్మ నింగి జూచినవెంటనే ప్రాణము పోయిన ట్లయ్యెను. అబ్బురము చెందుచు త్వరితగతి కమండలువుఁగొని నదీతీరమునకుఁ దానమాఁడ నేఁగెను.

నదీతీరము చేరిన మాధవశర్మ కమండలువు నొడ్డుననుంచి నాభిమాత్ర జలమధ్య మున కేఁగి భగవన్నామము నుచ్చరించుచు నాసికా కర్ణముల నుభయకర యంగుష్ఠ కనిష్ఠి కలతో మూసి నీటియందు మునిఁగినవాఁ డయ్యెను. అట్లు మునిఁగిన శర్మకు వర్ణింపరాని చోద్యములు కానవయ్యెను.

* * * *

అతఁ డొక సుందరమైన పుష్పోద్యానము చెంగట తిరుగుచుండెను. అచ్చోట సర్వాంగ సౌందర్యవతి యగు నొక లేమ కానుపించినది. పలుమారు లా తన్విని వీక్షించుచుండెను. విరహమునకు లోనై క్రమక్రమముగ చతుర్థావస్థకుఁ బాత్రుఁ డయ్యెను. చూచుచుఁ దనిసియుండిన మేలే! అట్టులు జరుగలేదు. కాముకునకు ప్రప్రథమమున ప్రీతి కలుగును. దానివెంబడి మనసున సంగమ ముదయించును. ఆపై నిసంకల్పము లారంభము. తదుపరి ప్రలాపము. ఇదియే చతుర్థావస్థ. ఇట్టి యవస్థకు లోనై యెట్టులో యొకట్టుల లేని ధైర్యముం దెచ్చుకొని, సన్నిధికింజని తనవానిగం జేకొనుమని ప్రార్థించినవాఁడయ్యెను. అందులకా తన్వి "స్నాన సంధ్యాద్యనుష్ఠానములను వదలి త్రికాలములయందుఁ దనతోఁ గామునియారాధించుట;కలిగెడి సంతానమంతటిని పోషించుట; తనధనాగారములకన్నిఁటి కధిపతియై సరియైన లెక్కలను సంతానము పెరుగువఱకు నుంచుట; తదుపరి ధనాగార ములను పుత్రుల కప్పగించి తా నియోగించిన పనుల నెరవేర్చుచుండుట" యిట్టి హిర ణ్యాత్మవరములచే నాతనిని బంధించివైచెను. కాముకున కింగితజ్ఞానము సున్న. కావున నీ వరముల కన్నిఁటికి శిరమువంచి యా లేమను పాణిగ్రహణ మొనరించెను.

త్రికాలములయందును కులాచారములను వదలి మన్మథారాధనము చేయుచుండెను. ఇట్టులుఁ గొంతకాలమరుగునరికి పుత్రశతముదయించెను. వరుస క్రమమునఁ జిన్న పెద్ద తారతమ్యముండెను. అప్పగింపఁబడిన ధనములకు లెక్క వ్రాయలేక విసిగిపోవుచుఁ బుత్రుల బాధల ననుభవింపలేకను కామునకుం జిక్కనగమయ్యెను. 'కామాతురాణాం న భయం నలజ్జా'యనిగదా నీతివాక్యము! ఇంతకన్న నేమిచేయగలఁడు?

కష్టమునకో, సుఖమునకో యలవడిన ప్రాణమునకు సంసారమునందు మార్పుజనించుటయే కష్టము. అనఁగాఁ గష్టజీవి ధనాగారముల కధ్యక్షుఁడైన వానిని కాపాడుకొనుట కష్టము. ధనవంతుఁడు పేదయైన కష్టము. మధ్యస్థున కెల్లప్పుడును కష్ట పరంపరలే!

మాధవ శర్మకు సుఖమనునదిలేదు. ఒకవిధమగు కష్టమునకు లోనైనవాఁడుగావున నిఁక నా కష్టము కష్టముగ గన్పట్టుట లేదేమో! కాని యప్పుడప్పుడు కష్టమని, పాపమని యనుకొనుచుండువాఁడు. ఒకవంక పుత్రులు దుస్తులు కుట్టింపుమని, తినుబండారములు తెచ్చిపెట్టుమని గోలచేయుచుందురు. వేరొకవంకఁ గొందరు తమ్మెత్తికొని యాడింపుమందురు. ఇంకొకవంకఁ గొంద రమ్మకొట్టెననియు, గ్రామములోని బాలురు కొట్టిరనియు రోదనము చేయుచుందురు. వేఱొకవంక కొందఱు పాఠశాల కేఁగమనియు కందుకము లాడుకొందు మనియు నవహాస్యములతో గేళిచేయుచుందురు. పుత్రులగోడు లిట్టుండ యల్లుండ్రు కల్పించెడి యపవాదులకు లెక్కలేదు. మధ్యమధ్య పరిచారులు వేతనమునకుఁ గోలలుసేయుచుందురు. చుట్టునందరు చేరి పలురకముల నాదములు వినుపించుచుండగా భార్యవచ్చి క్రీడింపరమ్మనును. ఇన్నివిధముల మనసు చెడినను చెడిన తతి క్రీడలకు హృదయమున యానందముండునా?

పలువిధములగు బాధలకు లోనైన మాధవశర్మ పగవానికైన నిట్టి బాధలు వద్దురా తండ్రీ! యని వినువుకొనుచు, ఓ భగవంతుఁడా! నా కీ చెట్టసంసారము నేల కల్పించితివిరా! ఇట్టు లనుభవింపు మని ప్రారబ్ధ కర్మము కలదా? ఉన్నచో నీ బాధల నింతటితో రూపు మాపుము. జన్మజన్మములయం దెన్నఁడు నిఁక నిట్టి బాధలకుఁ గుఱియొనరింపకుము తండ్రీ! యని పరమేశ్వరుని వేడుచుండును.

* * * *

మొదటిసారి నీటమునిఁగిన మాధవశర్మ యిట్టి ప్రార్థనముం జేయుచు నీటనుండి రెండవతూరి మునుఁగఁ బైకిలేచెను. లేచుసరికి తాను నీటిలో మునిఁగిన యా కొలఁది కాలములోనే తాను వివాహమాడుట; బాధలనొందుటగాఁ గల దృశ్యములు నేత్రగోళ ములకుం గనుపించినట్టులయ్యెను. ఒకవేళఁ దా ననుభవించిన గాథయంతయు నిజమేమో యనుకొనుచుఁ దిక్కులఁ జూచెను. ఒడ్డునయుంచిన కమండలువు, వసనము లటులే యుం డెను. తాను వచ్చునపుడు చూచిన వృక్షములు కానుపించె ప్రతినిత్యము తాను స్నాన మాచరించెడి నది తానున్నదియే యై యుండెను. క్షణకాలములోఁ దనకుఁ గోచరించిన యా విచిత్ర సంఘటనముల కాశ్చర్యమొందుచుఁ జకితమనస్కుఁ డయ్యెను.

ముమ్మారులు స్నానమొనరించి సూర్యున కర్ఘ్యాదుల నొసంగి తీరముంజేరి, వసన ముల ధరించి కమండలువుం గొని యాశ్రమమునకు వచ్చుచు నొకచోట నిలువంబడి యా కాశము వైపుం జూచి 'యో సర్వజీవరక్షకా! దీనజన బంధూ! నీ మాయ లనంతములు. అవాఙ్మానసగోచరములు. వర్ణింపరానివి. కాలతత్త్వమెఱుంగ గోరిన నాకొక కథారూప మున తత్త్వము నెఱింగించితివి. నీ చైదమ లిట్టి వని గ్రహించితిని. కాలమే నీవ. నీ స్వరూ పమే కాలము. కాలమయు డీశ్వరుఁడనుటలో సర్థమే కలదు. లేదనుట మాయయే యగును. మాయనుండి మేల్కొలిపిన నీకివే యనేక నమస్కారశతములు. కాలరూపుఁడవైన నీవు చేయరాని పనులు లేవు. నీ సంకల్పమే సృష్టి స్థితి సంహారత్రిగుణములకు లక్ష్యము. వేదాంతమూర్తివి. అతీతుఁడవు. ఓ పరమేశా! నీ రూపము జూపి నీలోఁ గలుపుకొనుమని నమస్కరించిన వాఁడై

'అంభోధిః స్థలతాం స్థలం జలధితాం ధూళీలవ శ్శైలతాం
మేరు ర్మృత్కణతాం తృణం కులిశతాం వజ్రం తృణప్రాయతాం,
వహ్నిః శ్శీతలతాం హిమం దహనతా మాయాంతి యస్యేచ్ఛయా
లీలాదుర్లలితాద్భుతవ్యసనినే దేవాయ తస్మై నమః.'

అని యనంత గుణమూర్తిని ధ్యానించుచు యాశ్రమముం జేరెను. నాఁటనుండి నిఁకఁ గాలతత్త్వమును గూర్చి విచారింపక బ్రహ్మనిష్ఠయందుఁ గాలమును వేగించుచు లోక కల్యాణమునకై తన వాఙ్మయ మంతటిని వినియోగించిన వాఁడయ్యెను.



# గురుభక్తి

ఎన్. కోటయ్య బి. ఏ. గారు

అతఁడు పరమును భావించి యైహికము త్యజించి దేశాటనం బాచరించు వృద్ధ
యోగిపుంగవుఁ డాతని యొద్ద నొక్క-ఛాత్రవరుఁ డుండె సుకుమారగాత్రుఁ డెలమి.
ఐహికసుఖంబు లను నిక్షు వానియాని - పీల్చి పిప్పియొనర్చి యా వృద్ధయోగి
శాశ్వత సుఖప్రదపదార్థ సంగ్రహార్థ- మయి యొనర్చు సమస్త తీర్థాటనంబు.
చిన్నతనమునఁ దలితండ్రి సన్నమీఁద - 'నా'యనెడు వారెవరు లేకపోయినట్టి
వాని నొకని సద్గుణశీలుగా నెఱింగి - కరుణమెయి యోగి శిష్యునిగా గ్రహించె.
వాఁడు నానాఁట సద్గుణమయుఁడు గలప - సరససంగీత సాహిత్య శాస్త్రవేది
యగుచు యౌవనావిర్భావమైన కొలఁది - చారుసుకుమార సుందరాకారుఁ డయ్యె.
చిన్నతనమున గురునండఁ జేరియుండు - కతన వైరాగ్యభావ మొక్కండె కాని
యితరమేమియు నెఱుఁగఁ డా క్షితిసుర ప్రవరుఁడు భ్రమరకీటన్యాయసరణి దోఁప.
ఏమఱక గురుశుశ్రూష నెపుడు భక్తి-శ్రద్ధలను సల్పుచుండెడి ఛాత్రవరుని
నిరుపమ సమస్త పాండితీ నిలయుఁ జూచి - ముదమున గురుండు తనలోనె పొంగిపోవు.
ఒక్కనాఁ డిద్దఱును నొక్క యూరు సేరు - నరికిఁ బొద్దెక్కిపోయెను ఛాత్రుఁడు గురుఁ
డాఁకటం గటకట పడు టరసి యొక్క - చెట్టు నీడను విడియఁగాఁ జేసియంత.
ఎప్పటట్టుల మధుకరమెత్తి భోజ్య-ములను దేనెంచి పురమధ్యమునకు నేఁగి
యొక గృహప్రాంగణంబునఁ బ్రకటదైన్య-మునను 'భవతిభిక్షాం దేహి'యనుచు నఱచె.
కాని గృహమున నాఁ డాబ్దికంబు గాన-నందఱును వారివారి కార్యముల మగ్న
లగుచు భిక్షుకునకు బదులాడరైరి - ముగుద యొక్కతె దద్ద్వార భూమిచేరి.
"తరుణుఁడవు నీకు భైక్ష్యమెత్తంగ నేల? - ఇంకెవరికోస మింత శ్రమింతు"వనిన
భిక్షుకుఁడు తెల్పెను "మదీయవృద్ధ గురుఁడు-ఆఁకటను సోలుచున్నాఁడు-అతనికొఱకు"
చారు యౌవన సుందరాకారుఁడైన - వటువు నిశ్చల భక్తిభావమును గాంచి
ఆబ్దికంబైన మఱియేమి యైనఁగాని - బిచ్చమిడుటకె మదిలోన నిశ్చయించి,
ఆమె యేకుడి కింటఁ జేయఁబడినట్టి - గారెలును బూరెలును కజ్జికాయలాది
గా సమస్తము గుట్టుగాఁ గట్టిపెట్టె - హర్షమున గురు సన్నిధి కరిగెవాఁడు.
వృద్ధయోగి రుచ్యపదార్థ వితతిఁ గుడిచి - "తనివి దీఱదు. వీని నింకను దినంగ
బుద్ధియగు వత్స! కొని తెమ్ము పొ"మ్మనంగ - నిట్టటాడక వేగమయేఁగి యతఁడు.

తొంటిగృహము సమీపించి తొయ్యలిఁగని "మాగురు డిం కొకింత దెమ్మనెను తల్లి!
క్షమను నిడఁగదె!"యనిపల్కె సవినయముగ - మచ్చెకంటియు మదిఁగో పముప్పపడఁగ,
"గురుఁడు పంపినవాఁడె? కక్కుఱితి మెయిని - నీవె వచ్చితిగా కవినీతిపరుఁడ!
పాపమనిపెట్ట నింకొక తేప వత్తె? - ఇంత గురుభక్తికలవాఁడవే నిజంబు!"
అనియు వాని సరళ దృష్టు లరసి సదయ-హృదయమై పరిహాసము గదురఁ బలికె
"వడుగ! నీగురుభక్తి యేపాటిదోయి! - ఏకలవ్యునివలెనె నటింతు వహహ!
మట్టి బొమ్మను గురునిగా మానసమునఁ - దలఁచి కొలిచె నతండు లోకులు నుతింప
నట్టి బొమ్మయులేని మిథ్యాగురువును- భక్తి గొలిచెదవే నీవు భక్ష్యములిడి!
కుడిబొటనవ్రేలు నిడె నతండడిగినంత - నీవు కనుగ్రుడ్ల నిత్తువే నియతితోడ
పెఱికి గ్రుడ్లనిచ్చినఁగాని భిక్షమిడ న-టంచు నేఁ గోరియున్న చో......
ఆమెవాక్యము ముగియ లేదపుడె యుష్ణ - రక్తధారఁ దత్ప్రాంతోర్వి సిక్తమయ్యె
ముందుఁ గుడికన్నుకొనగోటఁ బొడిచివాఁడు - పెఱుకుచుండెను గ్రుడ్డూడి వెలికిరాదు.
ఆమె నిశ్శాంతపోయి యయ్యయ్యొ! ఆఁగు-మాఁగు మని వాని హస్తద్వయంబుపట్టి
తన్ను దాఁ దిట్టుకొనుచుండెఁ దాల్మిదూలి - నిండుకుండ యటుల్ మిన్నకుండె వాఁడు.
ఆమె విస్మయభయకంపితాంగ యగుచు - నాతురత లోనికేఁగి భిక్షాన్నములను
మస్తుగాఁ దెచ్చియిచ్చి యమ్మాణవకుని - త్వరననిపె నున్న ముప్పేమి వచ్చునోయని.
గురుఁడు తన స్థితిజూచినఁ గుడువఁడేమొ-యని శిరమువంచి వాఁడు వర్ధనము సేసె
వృద్ధుఁడది యప్పుడే కనిపెట్టినాఁడు - తెలిసికొన్నాఁడు సర్వము దివ్యదృష్టి.
తా నెఱింగిన సిద్ధౌషధముల వాడి - బాధనప్పుడ కడ ముట్టఁబాపినాఁడు
గురుఁడు శిష్యుఁడు కూర్చుండి కుడిచినారు - ముచ్చటల హాయిగాఁ బ్రొద్దుపుచ్చినారు.
ఇట్టి శిష్యుఁడు లభియించినట్టి గురుఁడు - ఇట్టిగురుఁడు లభించిన యట్టి శిష్యుఁ
డవని ధన్యతముల్; వారి యనఘచరిత మవనిగల యంతకాలము నలరుగాత!

## చందాదారుల జాబులు

చందాదారులు వ్రాయు జాబులలోగాని, పంపు మనియార్డరులలో గాని, తమ చందానంబరును, పూర్తి చిరునామాను స్పష్టముగా వ్రాయవలెను. ప్రత్యుత్తరము గావలసినవారు చీట్లనో కార్డునో పంపవలెను. మాది బీద కార్యాలయ మను సంగతి మీ కందరికి తెలిసియే యున్నది. చందాదారు లందరికి మేము సరిగా పరిశీలించి పత్రికలను పంపుచునే యున్నాము. తమతమ పోస్టుమేనులకు సరిగా జెప్పగోరు చున్నాము.

మేనేజర్ 'విభూతి' —సికింద్రాబాద్.

# మతములు - అవతారములు

శ్రీ యతిరాజం వేంకట కృష్ణదాసుగారు

సుధీమణులారా, సత్యాన్వేషకులారా!

1. అద్వైతమతమున, (1) బ్రహ్మము సత్యము. (2) ఆ బ్రహ్మము యొక్క అవిద్యాప్రతిబింబమే జీవుఁడు. కావున జగత్తు మిథ్య. ఈశ్వరుండు మాయాప్రతిబింబ చైతన్యము. (3) జీవేశ్వరు లిరువురును అసత్యత్వవిషయమున సమానులే అయినను జీవుఁడవిద్యకు లోఁబడువాడు. ఈశ్వరుఁడు స్వాధీనమాయకుఁడు, జీవేశ్వరులకు పారమార్థిక సత్యత్వములేదు కాని వ్యావహారికసత్యత్వము లేకపోవుటలేదు. (4) రజ్జుసర్పభ్రాంతివలె లేని మాయను జూచి జీవుఁడు భ్రాంతుఁడగుటచే గురూపదిష్టుఁడై మహావాక్య విచారణము జేసి ముక్తినందునని కదా చెప్పబడెను.

2. విశిష్టాద్వైతమున, (1) జీవేశ్వరప్రకృతు లనాదీయములు. పరబ్రహ్మము పూర్ణుఁడు, వ్యాపకుఁడు, అవాఙ్మనస గోచరుఁడు, నిరవయవుఁడు. కావున యోగమునందును అప్రత్యక్షుడు. (2) ఇట్టి బ్రహ్మను ప్రథమమున క్షీరమునందు నీరమువలె నామరూప విభాగములు సేయ నలవిగాని సూక్ష్మచిదచిత్తులతోఁగూడియుండి పిదప నామరూప విభాగములైన స్థూలచిదచిత్తులతోఁ కూడిన దగుచున్నది. (3) ఆ బ్రహ్మమును ధ్యానించుటచే శాశ్వత మగు పరమపదప్రాప్తి కలుగును. (4) పరాప్రకృతియే జీవస్వరూపము అని కదా చెప్పఁబడెను.

3. ద్వైతమతమునందు (1) బ్రహ్మము నిరవయవుఁడు, రూపనామ క్రియావిరహితుఁడు కావున అసత్యము. (2) వైకుంఠవాసుండైన విష్ణువే పరబ్రహ్మము, ఆతడు నిర్గుణుండు కాఁడు. లక్ష్మియే జీవభూతయగు పరాప్రకృతి. (3) జీవులకు భగవదధీన కర్తృత్వము కలదుగాని స్వతంత్ర కర్తృత్వములేదు. జీవేశ్వరప్రకృతు లనాదీయములు. వీని కెప్పుడును ఐక్యము చేకూరదు. (4) విష్ణువును ధ్యానించుటచే స్వరూపయోగ్యమైన ఆనందము పుట్టును. స్వేచ్ఛావిహారు లగుదురు. ఇదియ మోక్షము అనికదా చెప్పబడెను.

పరికింపుడు. అద్వైతమతమున (1) అనాదియగు బ్రహ్మమునకు అవిద్యచే అనాదిగా కలుగు మాయావృతపరిభ్రమణాదు లెట్లు తొలఁగును. (2) ఈ మతమున బ్రహ్మ మవాఙ్మనస గోచరుఁడు, మిథ్యారూపుఁడు. కావున ఇట్టి భగవానుని దయకు ప్రతిబింబ రూపులైన అసత్యజీవులు యత్నింప నేల. (3) పూర్ణుడై సత్యస్వరూపుఁడై యున్నను, లేక మిథ్యారూపుఁడై యున్నను, బ్రహ్మము మిథ్యయైన మాయయందు ప్రతిఫలించు టెట్లు, వేరొకటి కలదనిన అద్వైతమెట్లగును. (4) బ్రహ్మము మిథ్యారూపుఁడైనపుడు వానిని

మిథ్యాప్రతిబింబులగు జీవులెట్లు ధ్యానింతురు. (5) జగత్తు మిథ్య కావున అందలి వేదాది శాస్త్రములును మిథ్యలైనపుడు బ్రహ్మమేయగు జీవుఁడు తెలియవలసిన దేమి, చేయవలసిన దేమి. (6) వేదాదిశాస్త్రములు మిథ్యలైనపుడు వీరి జ్ఞానమును, అందుచేవచ్చు మోక్షమును యేల మిథ్య కాజాలదు. (7) శాస్త్రజన్యజ్ఞానము వలననే బ్రహ్మైక్య జ్ఞానము కలుగునపుడు బంధ హేతువు లగు కర్మలు సేయనేల. (8) జీవుండు. ప్రతిబింబమే యగునేని, అవస్తువగు ప్రతిబింబమునకు మాయావృత పరిభ్రమణాదు లెట్లు కలుగును? ఈతిబాధాదు లెట్లు కలుగును. జ్ఞానాజ్ఞానము లెట్లు కలుగును. బంధ మోక్షము లెట్లు కలుగును? (9) అవిద్య యగు అజ్ఞానమునందు ప్రతిఫలించి యున్న జీవులకు అజ్ఞానమే స్వభావమై దేహానంతరము వరకు విడువకుండుట సహజము కనుక నా అజ్ఞానమును శాస్త్రజన్యజ్ఞాన మెట్లు పోఁద్రోలును. (10) మిథ్యారూపుడగు బ్రహ్మము మిథ్య యగు మాయయందు మిథ్యగా ప్రతిఫలించినపుడు ఆ మిథ్యా ప్రతిబింబమునకు సత్యమైన జ్ఞానము కలుగుటెట్లు? మిథ్యాజ్ఞానముచే మిథ్యయగు రజ్జువును జూచుటెట్లు? మిథ్యయగు సర్పభ్రాంతి దోఁచుటెట్లు. మిథ్యయగు గురునిచే సత్యోపదేశ మొందుటెట్లు. మిథ్యయగు మహావాక్య విచారణ సేయుటెట్లు. సత్యమైన మోక్షము ప్రాప్తించుటెట్లో మతాభిమానులే తెలుపగలరు.

విశిష్టాద్వైతమతప్రకారముగా (1) బ్రహ్మము అవాఙ్మానసగోచరుండును, భావనా (అసత్య) రూపుండును అగుటచే అట్టి వానిని సత్యమైన జీవు లేల ధ్యానింపవలెను. (2) బ్రహ్మము భావనారూపుఁడైనపుడు ఆతని దయయును యేల భావము కాజాలదు. (3) భావనా (మిథ్యా) రూపుఁడై చూచుటకును, పొందుటకును అలవిగాని బ్రహ్మ మీసత్యజగత్తుల కెట్లు ఆధారుఁడై యుండును. బ్రహ్మము సత్యస్వరూపుఁడైనను మిథ్యారూపుఁడైనను ఆ బ్రహ్మమునం దాదిలో సత్యస్వరూపులైన జీవులు, క్షీరోదక న్యాయముగా నున్న, పదార్థమున వేరైన యవి ఎట్లు నామరూప విభాగములు సేయ నలవిగాక యుండును.(5) బ్రహ్మము భావనామాత్రుఁడై దర్శించుట కయోగ్యుఁడైనచో అట్టి వానికి నామ మెట్లు చెల్లును. క్రియాపరుఁ డెట్లగును. (6) రూపనామక్రియల కన్యోన్యము కదా? భావనారూపుఁడైనవాఁడు, రూపనామక్రియలు గల సత్యజీవుల యొక్క సత్యజ్ఞానయోగ భక్త్యాదుల నెట్లు గ్రహించును. వారికి పరమసుఖం బెట్లొసంగును. (7) సత్యస్వాంతవచో ధర్మజ్ఞాన క్రియాపరుఁడైన శ్రీకృష్ణుఁడు, భావనా రూప నామక్రియా పరుఁడైనవాడు పరబ్రహ్మ మనియు, ఆ బ్రహ్మమే తనకు స్థానమనియు ఎట్లు వచించును. (8) పరాప్రకృతి యను పదము స్త్రీ లింగము కదా? ఇట్లు స్త్రీ లింగ పదముచే చెప్పంబడిన యది పురుషుఁ డను పుంలింగపదముచే బిలువఁబడు జీవస్వరూప మెట్లగును. (9) పరాప్రకృతియే జీవస్వరూప మైనచో, దేహాదులు అష్టవిధములైన యీ ప్రకృతియందు లయించునట్లు జీవు లా ప్రకృతియం దేల లయింపవు. (10) జీవులు

మోక్ష స్థితియందు బ్రహ్మమునం దైక్యపడక ఆయనయందు సృష్టి జరుగుట కవకాశ మీయబడిన ఆ భాగమునఁ దిరుగాడు నెడల, జీవులకు జన్మములను కలుగఁజేయు ఆ భాగముయొక్క స్వభావముచేత వార లెప్పుడును మరల మరల నేల జనింపరో ? మతాభిమానులే తెలుపగలరు.

ద్వైత మతమునందలి భావములు యథార్థమగునెడల (1) శ్రీకృష్ణస్వామి తనకు స్థానమైన పరబ్రహ్మ మొకటి కలదనియు, ఆ బ్రహ్మముయొక్క తేజోజ్ఞాన విభుత్వ శక్త్యాదులను గురించి స్పష్టీకరించినట్లు గీతయందు వివరింపఁబడిన వాక్యములను పరిత్యజించుటకు మాత్రము వీరికి స్వతంత్ర కర్తృత్వము కలదా ? లేక నా భగవద్వాక్యము లెట్లు పరిత్యాజ్యము లగును. (2) ఏకదేశస్థుడైన విష్ణువు స్వరూప శక్త్యాదులచేత పూర్ణుడైయున్న పరబ్రహ్మ మెట్లగును? లక్ష్మియే జీవభూత యగు పరాప్రకృతి యెట్లగును. (3) జీవులకు పరమాత్మని దర్శనము కలుగక ధ్యానమాత్రముచే భగవత్స్వరూప యోగ్యమైన ఆనంద మెట్లు కలుగును. (4) జీవులు అస్వతంత్రులై భగవత్ప్రేరితముగా నొనర్చు కర్మలు బంధహేతువు లెట్లగును, మతాభిమానులే తెలుపగలరు.

(1) సత్యముగా మతకులాభిమానములు విడువగా సత్యమైన బ్రహ్మానుభవము లభించునా? లేక నవి కలిగియుండగా వానిచేతనే బ్రహ్మజ్ఞానము లభించునా. (2) బ్రహ్మానుభవజ్ఞానము శాస్త్రీయజ్ఞానమున కుపకరణమా? లేక శాస్త్రానుభవ జ్ఞానము బ్రహ్మజ్ఞానమున కుపకరణమా. (3) పరబ్రహ్మ(సదాశివ)సాక్షాత్కారానుభవజ్ఞానపరుఁడా బ్రహ్మవిద్యను బోధింప నర్హుడా? లేక శాస్త్రసాక్షాత్కారానుభవపరుఁడా బ్రహ్మ సాక్షాత్కారానుభవమునుగూర్చి బోధింప నర్హుడా. (4) శాస్త్రానుభవము బ్రహ్మానుభవమును గడింపఁగోరునా, లేక బ్రహ్మానుభవము శాస్త్రానుభవమును గోరునా? అవతార మననట్టిది. శ్రీ బౌద్ధ శంకర రామానుజ మధ్వాచార్య స్వాములవారలు భగవదవతారములే నని మతాభిమానులు వేనోళ్ళ వారిం బొగడుట లోకవిదితమే. ఈ స్వాములవారలు భగవదవతారములే అయినచో ఒకరిమతము నొకరు ఖండించి తిరస్కరించి మతాభిమానములు మెండుపరచు టేటిధర్మమో ? అందరును అవతారము లనుట స్వయంబ్రహ్మత్వమును కల్పించుకొనుటకే యగునుకదా! ఇది ఆధిక్య స్వాతంత్ర్యములను వెల్లడించు మానవ ధర్మమా, లేక భగవదవతారము లిటువలెనే నేయవలయునా? మతాభిమానులే తెలుపగలరు. సత్యాన్వేషకు లెల్లరు నే నిందు వెల్లడించిన విషయములను గమనించగలరు.



# హిందువులు, మహమ్మదీయులును ఆర్యులా?

డా. ప్రాణనాథుగారి సిద్ధాంత విమర్శ

(పండిత చిదిరెమఠము వీరభద్రశర్మ.)

గోలకొండ పత్రిక (18-8-1941) లోని శ్రీ డా. ప్రాణనాథ విద్యాలంకారుగారి యుపన్యాససారాంశమును పాఠకులు గమనించియుందురు. ప్రాచీనకాలమందు ఏకజాతిగా నున్న ఆర్యులే తరువాయి హిందువులుగాను, మహమ్మదీయులుగాను భేదము నందిరని సమర్థించుచున్నట్లు దెలిసి సంతసించని వారుండరు. సర్ హైదరీగారివంటి మహా మహుల ప్రాపున డా. ప్రాణనాథుగారి బోటి విద్వాంసుల పరిశోధనఫలముగ నీ సిద్ధాంతము నెలకొనుచో భారతదేశమందలి అనైక్యపిశాచమును సులభముగ బారద్రోల వచ్చును. జర్మను లందరు నేడు ఆర్యుల మనియే ప్రచారము చేయుచున్నారు. యూరపియనులును ఒక విధముగ తమ మిశ్రార్యత్వము నంగీకరించియున్నారు. చీనా, జపాను, లంకా, బర్మా, జావా నివాసులు బౌద్ధులే కావున అచ్చముగ ఆర్యరక్తోద్భవు లనుటలో సందేహములేదు. ఏషియాకు పొరుగింటనున్న రషియనులును ఆర్యసోదరులు కాకపోరు. అమేరిక యనగా ప్రాచీన అమరావతి యనియును, మన ప్రాచీనులగు అమరులు నివసించి వారే యిట్లు మారిరనియును 1934 మార్చి మాసమున నొక డాక్టరుగారు లఖనౌ నగరములో నుపన్యసించిరి. అసలు ఆదికాలమున మానవజాతి యంతయు ఏకమనియును, ధర్మభేదము లేకుండె ననియును, చరిత్రవిమర్శకులు వాకొనుచునేయున్నారు. తమ పూర్వమతమును మార్చుకొని మహమ్మదీయములోనికో, క్రిశ్చియానిటియందో, బౌద్ధముననో, హిందూత్వమునందో ప్రవేశించు విపులమైన జనసంఖ్యను మనము కనుగొనుచునే యున్నాము. మన విమర్శన నీ పద్ధతితో సాగించుచో ఏ పరిశోధనలును అక్కరలేదు. "అంతా బ్రహ్మమయం బీ జగమంతా బ్రహ్మమయం" తత్త్వమును "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని యుపనిషత్తు లుపదేశించి కనీసము రెండు వేలసంవత్సరములు గడచినవి. కాని శ్రీ ప్రాణనాథుగారి నిరూపణసరణి యిట్టిది కాగూడదు. తమ వాదమునకు వాఙ్మయ ప్రమాణములను చూపవలసి యుండుడు. కావున ఈ క్రింది నివేదనను వారు చిత్తగింప గోరుచున్నాను.

డా. ప్రాణనాథుగారి మొన్నటి హైదరాబాదు యుపన్యాసమును ప్రత్యక్షముగ వినుట తటస్థించలేదు. కాని వారు కాశీ నివాసులు కావునను వారి యుపన్యాసములను నా

యధ్యయనకాలమున వినియుండుటవలనను పూర్వవిషయమును కొంతవరకు పురస్కరించుకొని నే నిద్దానిని వ్రాయుచున్నాను. ఇటీవల లభించిన సింధులోని మొహంజదాడో పంజాబులోని హారప్ప యను ప్రాచీనావశిష్టములపై కొంత లిపి కనుపడుచున్నది. ఈ లిపిని డా. మార్షల్, డా. హెరాస్ మున్నగు పాశ్చాత్యపండితులు పరిశీలించుచు యథేచ్ఛముగ ననేక వ్యాసములలో తమ భావమును వెల్లడించి యున్నారు. వారు చదివిన అక్షరములును, సంయుక్త పద్ధతియును సరియైన వని నాబోటి యల్పజ్ఞుడు నమ్మలేకున్నాడు. ఒకరు ఆర్యలిపి యనగా, మరియొకరు దానినే ద్రావిడ లిపి యనిరి. ఒకరు 'కమ్మా' యని చదువగా నింకొకరు 'మీన' యని పఠించిరి. యుక్తులావగింజ వోలెను, ఊహలచలరాజమువలెను గన్పట్టును. ఇది శైవ శాక్త వాఙ్మయ మని చెప్పువారిలో ప్రాణనాథుగా రొకరు. ఈ లిపిమాలనుగూర్చియును, మతతత్త్వములను గూర్చియును ఇటీవల ప్రాణనాథుగారే దేని పుస్తకమును ప్రకటించిరేమో! తెలియదు. ఈ పత్రికలో ప్రచురింపబడిన వారి యుపన్యాసము ధోరణి చూడగా నది కేవలము ఊహాగానమువలె నగుపడుటచే విమర్శింపవలసివచ్చినది. వేదాదివాఙ్మయములో తప్ప అంతకంటె ప్రాచీనములని వీరు నమ్మిన హారప్ప, మొహంజదాడో, అసీరియా ఈజిప్టులలోని శాసన లిపులలో ఎక్కడను ఆర్యజాతి శబ్దము రాలేదు. ఈ ప్రాక్కాలిక మానవులందరు ఆర్యులనుటకును ప్రమాణములు లేవు. అసలే పేరూరులు తెలియని ఈ మనుష్యులు మధ్యప్రాచ్యము (సెంట్రల్ ఏషియా)లో పుట్టిరనుటయును, వీరు ఆర్యులనుటయును పొసగని మాట. ఒకవేళ ఒకచోటనే పుట్టి యున్నట్లు మన మంగీకరించినను భారతదేశముయొక్క లిపి, ఉచ్చారణ, వ్రాయుపద్ధతి, అక్షరముల అధిక సంఖ్య, భాష, వ్యాకరణము మున్నగు వానికిని, పర్షియా, అసీరయా, ఈజిప్టు దేశములయొక్క లిపి, భాషలకును, భూమ్యాకాశము లంత భేదము కలదు. వీరు పూర్వముఖముగాను, వారు పశ్చిమముఖముగాను భాషలోను, ప్రార్థనలోను ఉన్నారను సంగతి ప్రత్యక్షము. వీరి యజ్ఞయాగములును, పార్శీవారి అగ్నిపూజను చూచి కొందఱు భ్రమపడిరి. ఇట్టిసామ్యము అమెరికాలోని యొక ప్రాచీనజాతిలోను, రోములోని మరియొక జాతిలోను చూపింపవచ్చును. ఇట్టి పద్ధతితోడ ఐతిహాసికులకు సమాధానము చెప్పజాలము.

అసలు ఆర్యజాతి వాదమును, అనార్యజాతివాదమును మొట్టమొదట మనకు వేదములో తప్ప అంతకంటె ప్రాచీనములైన మరియే శాసనములలోను కనుపడ లేదు. వేదమందలి ఆర్యశబ్దము ఒకజాతిని నిర్వచించుట అంతకంటె లేదు. ఆర్యుడు అనగా సజ్జనుడు-భద్రపురుషుడు (జంటల్‌మేన్) అనుకొన వచ్చును. ఒకవేళ అది జాతివాచకమే యని నిశ్చయమగుచో వేదసమకాలికులే ఆర్యులగుదురు. అదియును ఆ వేదమందలియుపదేశప్రకారము వైదిక దేవతలను ఉపాసించి, వైదికకర్మలనాచరించుచు, వైదికపక్షపాతముగలవారు మాత్రమే ఆర్యులగుట పొసగును. కాని ఏతద్భిన్నులు ఆర్యులగుటకేమాత్రము వీలులేదు.

మధ్యప్రాచ్యమునుండి ఆర్యులు యెడబాసి వివిధ దేశములకు బోయినందువలన పశ్చిమ దేశపు మహమ్మదీయాదులు వైదిక సంస్కృతిని విస్మరించియుందు రని వీరందు రేమో! అట్లగుచో భారతీయు లొకరుతప్ప తక్కిన యితర దేశవాసులందరును వేదాదులను మరచి తరువాత క్రొత్తగ లిపి భాషలను, మతములను నిర్మించుకొనినట్లు స్పష్టపడగలదు. దీనివలననే భారతీయవైదికు లొకరుమాత్రమే ఆర్యు లని ధ్రువపడగలను. భారతీయులు తప్ప మరొకరు ప్రాచీనకాలమున వేదము నుచ్చరించి సంస్కృతభాషలో సంకల్పము జెప్పుకొనినట్లు వాఙ్మయమునుండి ఒక ప్రమాణమునైనను శ్రీ ప్రాణినాథుగారు చూపింప గలరా! వారికి పరిశోధక పండితలోకము బ్రహ్మోత్సవముబట్టగలదు. వేదముకంటె పూర్వము భారతీయుల యొక్కయు, లేక మధ్యప్రాచ్యులయొక్కయు మతజీవితములను గూర్చిగాని శ్రీ మహమ్మదుకంటె పూర్వము ఇరాకు దేశీయుల మతమును గూర్చిగాని ఒక ధ్రువతరమైన సిద్ధాంతము చెప్పలేనపుడు వీరిది, వారిది ఆర్యమనుటయు వైదిక మనుటయు, పరిహాసా స్పదము. భారతీయులయొక్క వైదిక సాహిత్యమునుండియు, భాషనుండియు, శాస్త్రముల నుండియు ఇతర దేశీయులు సహాయము నొందియున్నారనుటలో వివాదము లేదు. అది యెపుడు ఏవిధముగ, జరిగినదో నిరూపించవచ్చునుగాని హిందూమహమ్మదీయు లిరువురును ఆర్యజాతివారనుట సారములేని సంగతి. మానవజాతి తత్త్వమునుబట్టి అంతయు నొకటియే యని చాల తేలికగ జెప్పవచ్చును. ఆర్యమతము, మహమ్మదీయమతము అను ప్రత్యేక సంస్థలు ఏర్పడినపిదప నేది ప్రాచీనము, ఏమతము నెవ రనుకరించిరి, ఎవరినుండి యెవరు పుట్టిరి, అను సంశయములను విడదీయుటకు గొప్ప పరిశోధన సప్రమాణముగ జరిగి అది పండితస్వీకృతి నందవలెను. ఇటీవల దీక్షాదారు సిద్దిఖుగారు తమ లింగాయత్ అను ఉర్దూ పుస్తకములో అరబ్బీ అక్షరములనుండి నేటి కన్నడ అక్షరములు పుట్టిన వని చిత్రములతోసహా ప్రకటించినారు. పాపము ఈ యుభయభాషల ప్రాచీన లిపిలో ఓనమాలను సైతము సిద్దిఖుగారు చదువుకొనలేదు. మొన్న యొకడాక్టరుగారు శైవమతము మహమ్మదీయమునుండి పుట్టినద నెను. ఈ మహానుభావుడు శైవమందలి ఒక గ్రంథము నైనను అవలోకించ లేదు. శ్రీప్రాణినాథుగారు ఇట్టివారు కారు. వీరికి ప్రాచీన చరిత్రలో ప్రతిభ గలదు. వీరి యభిప్రాయమునకు విలువయుండవలయును. ప్రాచీన కాలపు శాసనములలో అరబ్బీభాషగాని, అసీరియాభాషగాని దొరకినచో ఆశ్చర్యము జెంద నవసరము లేదు. దానికిని, హిందూమహమ్మదీయ మతములకును ఏకత్వములేక ఆర్యత్వమును ప్రతిపాదించుట నిరాపదము కాదుకదా! ఇతిహాస చర్చ లటుంచి భారత దేశముయొక్క భవిష్యత్కల్యాణమును మాత్రమే దృష్టియందుంచుకొని "హిందువులు మహమ్మదీయులును ఆర్యులే"యని ఘోషించుచో దీనినిగూర్చి నేనును మిక్కిలి సంత సింపగలను.



# నిన్ను నీవే విమర్శించు కొనుము

శ్రీ కవిరత్న లక్కన మల్లికార్జునుఁడుగారు

నిన్ను గురించి నీ యంతరాత్మసాక్షిగా నీవే విచారించుకో. నీ యాత్మయే నిన్నుద్ధరింపగలదు. అదియే నీకు బ్రహ్మానందము, భక్తి, ముక్తి, శక్తి, యుక్తి, సామ్రాజ్యాధిపత్యము సహితము నీ కీయగలదు. కాని దీర్ఘదృష్టితో, విచక్షణ బుద్ధితో విమర్శించి నిగ్గు తేల్చుకోవలసిన బాధ్యత నీయందు కలదు. కటిక చీకటియందు నీవు నిర్మలభావంబున నేకాగ్రదృష్టితో చూచిన కష్టములందు కలుగు సుఖముల వలె వెలుతురు కనిపించును. ఆ గాఢాంధకారములో నా వెల్తురును సృజించిన దెవరో యని విచారించితివా? విచారించిన నిర్ణయింపగలవా? అంతియెకాక నీ వాకసము వంక నేక దృష్టితోఁ దిలకించిన వేనకువేలు, లక్షానులక్షలు, కోటానుకోటులు చుక్కలు గుండ్రని ముత్తెములవలె గోచరించును. వెంటనే అసంఖ్యాకములగు నీ చుక్కలెట్లు పుట్టినవి? వీటిని గణింప గలమా? అనెడి ప్రశ్నలు నీ యంతరాత్మలో నుద్భోధించును. నీ కప్పుడు వచ్చెడి సమాధాన మెట్టిదో విచారింప కలిగితివా? విచారించిన తేలెడిది యగమ్యము. నిర్ణయ రహితము. తుదకు తబ్బిబ్బై ఆస్తికుఁడ వీవైతే దైవనిర్మితమందువు. కాని వెంటనే నాస్తికులు "దైవమును ఎవ్వరు పుట్టించిరి" అని నిన్ను బాధింతురు. అంతట వేసటచే నీవు చెప్పు ఈ సృష్టి ఎట్లా ఐందో" అని అంటే, నాస్తికుడిది యంతయు ప్రకృతి నిర్మితమనును. వెంటనే నీవా ప్రకృతిని మెవరు నిర్మించిరని ప్రశ్నించితే యాతడు ఆ నిర్మాణశక్తి ప్రకృతియందే కలదు. దానంతట నదియే నిర్మితమౌను అని అనక మానడు. అట్లనగానే నీవు ఔను తనంతట తాను పుట్టగలశక్తి తనంతట తాను పుట్టింపగల యుక్తి కలిగి చిత్తు సత్తు ఆనందమయుఁడైన వానినే దేవుడని నిర్ణయించి చెప్పగలవు. అప్పుడు నీకు నాస్తికత్వమునకు దూరమగునా? కాదా? లేకున్న నింతకంటె శ్రేష్ఠతరమగు హేతువాద పురస్కరముగా విజ్ఞులను సంతృప్తి పరచగలవా? సంతృప్తి పరచెడి విధానం బున్న లోకమునకు విదితముచేసి సర్వజనప్రియుడవు కారాదా? బాగా నీలో నీవు విచారించుకో. ఇదమిద్ధమని నిగ్గుతేల్చుకో. అంతియెగాక నీ యంతరాత్మయందు మదమత్సరంబు లనెడి శత్రువులు మదపుటేనుగులవలె విచ్చలవిడిగ సంచరించుచున్నవి. ఆ మదపుటేనుగులను విజ్ఞానమనెడి శూలముచే పొడిచి మదము లుడిపి నీ హద్దులలో, నీయాజ్ఞలలో నుంచుకో గలవా? అట్లు నీ హద్దులం దుంచుకొనలేనప్పుడే నీకు భావములు పుట్టుచున్నవి. నీ భావముల కొలది నీవు మాట్లాడుచుందువు. ఆ మాటల ననుసరించియె ప్రచారమునకు ప్రయత్నించెదవు. అట్టితఱి నీ భావములకు, నీ వచనములకు, నీ ప్రచారములకు, నీ క్రియలకు, విముఖులైన వారిపై ప్రబల విరోధంబును పాటింతువు. అంతియెకాక ప్రతిపక్షులను నీవశము

కావించుకొనుటకు యత్నింతువు. నీకు తోచినదియె నీకు ధర్మముగా కనిపించునని వాదింతువు. నీకు వలె నీకు విముఖులుగానున్న ప్రముఖులు నిన్ను బాధించితే వారిని దుష్టులు, దుర్మార్గులని తూరుప్పుపోత పెట్టెదవు. వేయేల నొక చిన్న "ఉదహారణనిందు విమర్శించిచూడుము. నీ వొక గాజుకప్పుగాని లేక మరే ఇతర వస్తువో నీచేత నుండి జారి నేలపడి భిన్నమైనయెడల పొరపాటని సాకు చెప్పి సమర్థించుకొందువు. అదియె నీభార్యయో, నౌకరుయో చేసిన కినుకతో తిట్టి కొట్టి వేధింతువు. అట్లు నీవు దండించునప్పుడు వారి చిత్తములయొక్క పరితాపములను గమనించ కలిగితివా? నీవెట్లు తెలుసుకొనగలవు? అట్టి దండన లభించినగాని నీ కనుభవమునకు రాదు. నీ వనుభవించియే కాని లేక నూత్మబుద్ధితోగాని పరుల కష్టసుఖములు కనుగొనగలిగిననాడె నీవు ధన్యుడవు కాగలవు. అప్పుడే నీ వరిషడ్వర్గంబుల జయించగలవు. ఆనాడే సర్వజనప్రియుడవు కాగలవు.

మానవుల దృక్పథములు పలువిధములు. ఎవరి దృక్పథములు వారు పురస్కరించుకొని వాటిని సమర్థించుకొనుటకే ప్రయత్నింతురు. అందుచేతనే ఈ మహాప్రపంచములో పలువిధమతములు, పలువిధపరిపాలనములు, పలువిధసమాజములు ప్రబలియున్నవి. వీటిలో కొన్ని కొందరికి రుచించును, మరికొందరికి రుచించవు. ఎవరియిచ్ఛవారిది. ఎవరి మతము వారిది అని నీవు శాంతించగలవా? శాంతించిన ఈతర్కవితర్కములు, వాక్కలహంబులు, ఈ ఘోరయుద్ధంబులు ఏల కలుగును? కనుక మానవునికి తన మతమును (విశిష్టతను) లోకమంతట ప్రచారము కావించవలయు ననెడి పట్టుదలయె యుండును. ఆ పట్టుదలయే నీ మతమునకు విముఖులైనవారిని వశము కావించుకొనుటకు నీచేతనె ఘోరతరకర్మలు సహితము చేయించుచున్నది చూడుమి. నేడు నాజీజము వ్యాపింపజేయుటకుగానె జర్మనీ చేసెడి ఘోరయుద్ధము. కాన ఏ దేశస్థుడైన తన దేశరక్షణకు తన మతరక్షణకు తన మనోధనముల నర్పించి పాటుబడుటలు సనాతనమునుంచియు వచ్చుచుండెడి యాచారములె. ఏ దేశస్థుడును, ఏ మతస్థుడును, తన దేశముకు తన మతముకు ద్రోహము కల్పింప డనుమాట నిర్వివాదాంశము. ఒకవేళ అట్టి విద్రోహి యెవడైనా నున్న వానిని మహాపాతకుడని లోకమంతయు తిట్టును. ఇది యేమిపాపమోగాని మన హిందూదేశ ప్రముఖులు హిందూశాస్త్రములను, హిందూఆచారములను మంటగలపి క్రొంగ్రొత్త మతములు పుట్టింపజేయుచున్నారు. పోనీ తన్మతములకు హద్దులుకలవా యని విచారించిన తుట్టతుదకు వ్యక్తి కొక మతముగా నేర్పడునట్లు తోచుచున్నది. ఇట్లే ప్రతినరుడు నొక్కొక్క మతమును (సిస్టమును) లేవదీసిన నీ దేశములో నొకమానవునితో మరొక మనుజునికి పొత్తుకుదురగలదా? ఎవరిష్టమువారిది, ఎవరి పద్ధతివారిది యనెడి ప్రముఖుల వలె ప్రతివారు తలచిన ఫలిత మేమబ్బునో విచారించగలిగితివా? తండ్రి ఇచ్ఛ తండ్రిది, తల్లి పెత్తనము తల్లిది, కొడుకులస్వేచ్ఛ కొడుకులది, పెండ్లామువర్తన పెండ్లాముదిగా నుండిన సంసారచక్ర మెంతవరకు త్రిప్పగలిగియుండువో నీవువిచారించితివా? అట్టిస్వేచ్ఛలు స్వతంత్రములు

ప్రతివారికి లభ్యమైన నా సంసారము ఘోరదవానలములోపడిన యింధనములవలె భస్మము కావలసినదియె సుమీ! అది నీవు తిలకింపకయె పొరపడుట ప్రమాదసూచకము కాదా! కనుక నీవు నుద్దేశించెడి శిష్టములందు బాగుగా ముందు వెనుకలు విచారించకయె, ప్రజలపై బలవంతమున ఘోర శాపములు పెట్టుట భావ్యమేనా? వ్యసనలోలురై పవిత్రప్రేమల యొక్క నిజతత్వములు గమనింపలేక నప్పటప్పటికి కలిగే ఉద్రేకములకే సహజమైన ప్రేమలనియెడి ప్రముఖులు చెలరేగిన నిలకడగల సంసారములు నేలగలియకుండునా; సద్వంశము లన్నియు పునాదులతో సహా బంగాళాఖాతములో కలియకుండునా? ఈ మాత్రపు సూక్ష్మదృష్టినైనా గమనించగలిగితివా? నీకు పుట్టినబిడ్డను నీవు ప్రేమింతువు. అష్టకష్టముల కూర్చి పెంచెదవు. నీ యాచారములు నీ నడకలు నీ మతములె నేర్పనెంచదవు. అట్టి తరి నీ పుత్రుఁడు పరాచారములకు పోవుచుండిన సహించగలవా? అదియుంగాక సనాతనము నుండివచ్చుచున్న తల్లిదండ్రులకు తనయులు సేవచేయవలె ననెడి ధర్మ మతిక్రమించి నా బుద్ధి నాయది, నా ధర్మము నాయది యని నీ కుమారుఁడు నిన్నెదిరించి నిన్ను హింసించిన నీవు సహించుకొనగలవా? అట్లే లోకమంతట గల పుత్రులు చేయఁబూనిన తల్లిదండ్రుల కోటిలో నున్న వృద్ధులు గంగానదిలో కలియవలసినదియేసుమీ!

"వేదములు శాస్త్రములు పురాణములు ఇతిహాసములు మానవనిర్మితములు కాన మేము మానవులమే; వారు చెప్పినవి ధర్మబద్ధములైన మేము వచించెడివి ఏల ధర్మ విహితములు కావని వచించెదవుకదా!" అట్లే నీభార్యయు "నాలో గూడా మానవత్వము కలదు. నేను పలికెడివియు న్యాయసమ్మతములె. కాన మీరు చేయు వ్యాపారములు నేను చేయుదును. నీవింటనుండి చీపురుకట్టచే ఇల్లూడ్చి కలాపిజల్లి ముగ్గులుపెట్టి వంట మొదలగు గృహకృత్యములు నిర్వర్తింపు"మనిన నీవొప్పుకొందువా? పోనీ యంగీకరించి సృష్టికర్తవద్దకేగి "స్త్రీలు రాజకీయ కార్యములందున్నారు. మేము వంటలు చేయు చున్నాము. కాన స్త్రీలకు బిడ్డలను కని పోషించెడి వ్యవధిలేదు. ఆ కాన్పులు పురుషులకె పెట్టుమని" మరియొక పద్ధతి పుట్టింపగలవా? అంతటి శక్తి నీకున్న ప్రపంచమంతయు నిదివరకె తల్లక్రిందు చేసియుండెడివాడవేమో! దానికేమిగాని, ఇప్పటికైనా బాగా నీవు విమర్శించిన తుట్టతుదకేది శరణ్యమో నీకు గోచరించును. సోదరా! నీవెన్ని యూహలు కల్పించుకొనిన నెన్ని శాసనములు నిర్మింపజాలిన తుట్టతుదకు నీజన్మభూమియె నీకు శరణ్యము. నీ మాతృభూమియొక్క శాస్త్రములె నీకు దిక్కు. నీ మాతాపితలయొక్క యాచారములె, నీ కనుసరణీయములు అని గుర్తింపవలెను. కాని యట్లుగాక పర దేశాచారములందు వ్యామోహముచే స్వదేశధర్మము విసర్జించుట గొప్పని భావించితివా? అట్లు నీవు పరదేశములకు లొంగి వారి కట్టుబాటులలో నీవు మెలగి నీ మాతృభూమి చిహ్నములు కాలఁదన్ని నీవు చెడ్డదియెగాక "తా చెడ్డకోతి వనమెల్ల చెరచిన దన్నట్లు" పవిత్రపు టాచారములకు విరుద్ధములగు శాసనములు ప్రజలపై పెట్టనెం

చుట పెట్టించుట మోసముకాదా? మన హిందువులందరొక్కసారిగా తమ ధర్మములు బాసి పరపద్ధతులకు లోనివపట్టిన "తల్లి పతివ్రత, తనయకులట" యన్నట్లు మాది హిందుమతము, మా యాచారములు పరుల యుచ్ఛిష్టములు అని చెప్పుకొనుటకైనా నీకు సిగ్గుజనింపదా? నీకు మాతృభూమిపై భక్తిలేదా? ఉన్నది. నీవు చేసెడిది మాతృభూమి సేవయే యని నీవు పొరపడుచున్నావు. విషయాంతరములందు కలుగు సామాన్య సౌఖ్యలాభములకు లొంగి ఎండమావుల జూచి సలిల మనెడి విభ్రాంతిని పొందుచున్నావు. అట్టి దుర్భ్రాంతులు పునాదులంట పీకివేసి నీ జన్మభూమిని నీ శాస్త్రములను నీ యాచార వ్యవహారములను నీ మాతృవాఙ్మయమును నీ పెద్దల ప్రతిభలను నిలబెట్టకలిగిననాడె నీవు పవిత్రవంతుడవైన భారతీయుఁడవు కాగలవు. ఆనాడె నీవు భారతీయులలో శిరోభూషణమువలె ప్రకాశించగలవు. వేదాగమపురాణేతిహాసంబులందు చెప్పిన యమూల్య విషయంబుల గుర్తించి ఎవరి ధర్మములు వారు నిర్వర్తించి మాతృదేశ సంరక్షణ కావింపకలిగిననాడె నీకు స్వరాజ్యము ప్రాప్తింపగలదు. కాని వట్టి యడియాసలకు లోనై శారదా ఆక్టులు, విడాకుల చట్టములు పెట్టినంతమాత్రమున వచ్చెడిది దుష్కీర్తియే కాని ఫలితమున్నా. ఈ నాటికైనా భవిష్యద్భాగ్యంబులు తిలకించి నీ యంతరాత్మను నిలకడపరచి భారత తేజము ప్రకాశించునటుల నార్యధర్మములు నిలబెట్ట గలవనియె నా ప్రార్థన. నిన్ను నీలో విమర్శించుకొని ఇంతకంటె మహోత్కృష్ట విధానంబు లున్న లోకమునకు విదితము చేసి మా విశ్వాసగౌరవములకు పాత్రుడవౌదువుగాత!



## ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు

(అఖిలభారతీయ ప్రాచ్యవిద్యా పరిషత్తు)

సుప్రసిద్ధమైన ఈ మహాసభయొక్క ౧౧ వ సమావేశము హైదరాబాదు నగరమున డిశంబరు ౨౦, ౨౧, ౨౨ తేదులలో జరుగనున్నది. ఈ మహాసభకు భారతదేశము నలువైపులనుండి ఆంగ్లవిద్యాధికులు, కొలదిగ సంస్కృతవిద్వాంసులును పాల్గొనెదరనియు మహావైభవముగా నుండు ననియును, ఉస్మానియా యూనివర్సిటీవారీ కార్యమునకు పూనుకొన్నారనియును కార్యదర్శిగారి వలన దెలిసినది. విద్యాధికులైన బీద సంస్కృత పండితులిందు పాల్గొనుటకు గాని శాస్త్రీయ విషయములను గూర్చి యుపన్యసించుటకు గాని తగిన సౌకర్యములు లేవని నియమములను బట్టి తెలియుచున్నది. ప్రేక్షకులసంగతి యింకను ప్రకటింపబడలేదు. మొత్తము పదునెనిమిది వివిధవిషయ భాషాసాహిత్యములకు సంబంధించిన సభ లుండు నట! ప్రత్యేకముగ అధ్యక్షులును, ఉపన్యాసకులును ఉందురు.

# వీరశైవులు; అంతశ్శాఖలు

శ్రీ కె. సుందరేశ్వరుడుగారు

నేను కొన్ని నాళ్ళనుండి వీరశైవమతమునుగూర్చి తెలిసికొనుటకు ప్రయత్నించినాను. నా రైల్వేయుద్యోగముకూడా నా జ్ఞానమునకు సహకారియైనది. నేను వేదాగమ శాస్త్రములనుగాని ఇంగ్లీషులోని ఘనమైన గ్రంథములనుగాని చదివినవాడనుగాను. పెద్దలవలన లభించిన యుపదేశమును అవలంబించి కించిద్ జ్ఞానము కలిగియున్నానేమో అదియు గట్టిగా జెప్పజాలను.

నా బడిచదువు ముగిసి యుద్యోగములో ప్రవేశించినపుడు, నేనొక నవనాగరికుడనుకొని స్నానసదాచారములలోను శివపూజలోను శ్రద్ధపుచ్చుకొను వాడనుగాను. మతపు ఉత్సవములందు సభలందు పాల్గొనుటకు అసలే వీలులేదు. ఐనను మతమురీతిగా నగపడు పుస్తకములను పత్రికలను చదువుచు వీరశైవ మహనీయులను పండితులను సందర్శించి సంభాషించుటలో నాకు చాల కుతూహలము. అకస్మాత్తుగా మా రైలుస్టేషనులో ప్రత్యక్షమై తమ మధురములైన మాటలతోడ అమందానందము గలిగించి నన్ను కృతార్థునిజేసిన శ్రీ శ్రీ నందులమఠం ఆనంద దేశికస్వాముల వారి దీక్షోపదేశముతో నేను నిర్మలమైన బాటలోబడి సాధకుడనై పదునేను సంవత్సరములు గడిచినవి. ఏదో అన్వేషించుచు యథాశక్తి పాటుబడుచున్నాను. ఆయినను 'విభూతి' లో ప్రకటింపబడు ఉత్తమోత్తమ వ్యాసములను విజ్ఞానసామగ్రిని దృష్టిలో పెట్టుకొని నాకు దెలిసిన మిక్కిలి స్వల్పమైన జ్ఞానముతో ఈ లేఖను ప్రకటింపదలచితిని. నా తప్పులను మన్నించి సన్మార్గము జూపింపగోరుచున్నాను.

వీరశైవ మతమనగా జాతిభేదములులేని హెచ్చుతగ్గులులేని సర్వసమానమైన మతమని చాలమంది పరమతీయులు భావించినట్లు వ్రాసినారు. నేనును మొదలు అట్లు నమ్మితిని. బసవపురాణమును మాత్రమే చదువుకున్నవారికి మొదలు అట్లే ఊహపుట్టును. బసవేశ్వరుని చరిత్ర, భక్తుల మహిమలను తెలిసినకొలది ఇటులే యనిపించును. ఇది యెంతవరకు సత్యమో యని నేను పరిశీలించగా ఎక్కడలేని సంశయము నాకు కలిగినది. వీరశైవ మతీయులలో ఉన్నన్ని జాతులు మరి యే ఇతర మతీయు లందును లేవని నేను తరువాత నిశ్చయించు కొంటిని. నేను మొదలు బొంబాయి ప్రాంతము గెజిటీయరులను, తరువాత మైసూరు, మద్రాసు, బీరార్, నిజాం ప్రాంతముల గెజటీర్లను జనపరిగణనా నివేదికలను చదివితిని. కొందరి వ్యాసములను కన్నడ, మరాఠి, ఆంధ్రభాషలలో అవలోకించితిని. వీరశైవులలో మొత్తము ఒక నూరైనను మహా శాఖలు అంతశ్శాఖలు ఉండునని తేలుచున్నది. ఉదాహరణార్థము ఒక మాహేశ్వర జంగము శాఖలో ఎన్ని భేదములో చూడుడు. పీఠాధిపతులు, పరంపరా మఠాధిపతులు, మఠము, మఠపతి, గణాచారి, స్థావరీకులు, సూకాబస్తీలు, మున్నగునవియే కాక తడపతులు, వస్త్రజంగములు, స్థలపతి జంగములు, బుడిగెజంగములు, లింగములు లేని జంగ

ములు, మున్నగు మహానుభావులు వేరే యున్నారు. వీ రందరికిని గురువర్గపు జంగమ మాహేశ్వరులకును ఏమియు సంబంధములేదు. కాని పరమతీయులు చాలమంది ఇట్టి వారినే చూచి యా జంగమదేవరలంత ఒకే జాతి యనుకొనుచున్నారు. మరియు వీరందరు జంగముల మని చెప్పుకొనుటయు కలదు. ఇక బణిజశాఖలో దీక్షావంతబణిజులు, శీలవంతబణిజులు, సవాయబణిజులు, లింగబణిజులు, ప్రత్తిబణిజులు, గాజులబణిజులు, తోటబణిజులు, జైనబణిజులు * శెట్టిబణిజులు అని యనేక భేదములుగలవు. ఇంకను లింగధారులైన వీరశైవసోదరశాఖలు కమ్మరి, కంసాలి, మెరె, మేదరి, కాపు, కుమ్మరి, చాకలి, మంగలి, గాళి జాతు లెన్నియో కలవు. ఈ సమస్తజాతులవారు సదాచారపరులై శివదీక్షులవడసి మతతత్త్వములను ఆచరించుటకు సమానహక్కులున్నచో వీరశైవము మరొకమారు ప్రపంచమునకు దారిచూపింప గలదని విశ్వసించుచున్నాను. శ్రీ బసవేశ్వరు డా కాలములో అన్నిజాతుల నైక్యముజేయ సంకల్పించినను వారి యల్పాయువులో అది సాధ్యమై నిలుఃవలేదని తోచుచున్నది. లేక పురాణకారుల అతిశయోక్తులలో ఎవరికెరుక ? ఆమాటయే నిజమైనచో బసవడు ప్రజ్వరిల్లిన కన్నడదేశములోనే ఇన్నిజాతులుండునా ! వీరశైవ ఆగమ శాస్త్రములును, పంచాచార్య పీఠాధిపతులును, సనాతన పండితులు, ఈ జాతిభేద నిరాకరణమునకు ఏ విధముగ తోడ్పడి వీరశైవము నుద్ధరింతురో నేను తెలిసినవాడను కాను గాని, ఆంధ్రదేశములో నుండెడు స్వల్పమైన వీరశైవ జనసంఖ్యను గమనించి అంతశ్శాఖలలో నైనను (అనగా బణిజులలో) నుండెడు తోట ప్రత్తి గాజులవారల భేదముల దీసివేసి ఏకకరణమును పెద్ద లనుమతించినచో గొప్ప సౌకర్య మేర్పడగలదని ప్రార్థించుచున్నాను. ప్రస్తుతము భక్తి మాహేశ్వరులలో పౌరోహిత్యమును గురించియును, విస్తళ్ళను గురించియు పోరాటములు జరుగుచుండగా నా అంతశ్శాఖల యేకకరణము బాంబువలె తమకు దోపవచ్చును. 'విభూతి' వంటి దివ్యగంగానది మనకు లభించియుండగా ఈ కించిత్కల్బిషము కడిగికొనజాలమా? జగత్పండితులును, సాత్త్వికమూర్తులును, వీరశైవమతాభివృద్ధికై జీవితమును సమర్పించినవారును అగు గురుజీ శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు ఈ యుద్యమము నాశీర్వదించినచో శీఘ్రముగ సఫలము కాగలదని విధేయుడనై విన్నవించుకొనుచున్నాను. ♦

* జైనబణిజాలు మాకు దెలిసినంతవరకు బళ్లారిజిల్లాలో మాత్రమేకలరు. వీరు పూర్వము జైనమతమును వదలి వీరశైవమతమును స్వీకరించియుందురు. మతము మారినను పూర్వజాతి సంకేతములు మారుట కష్టముగదా !

—సంపాదకుడు.

♦ సమాన ధర్మములను, సదాచారములను పరంపరగా గలిగి యున్న వారిలో శరీరసంబంధము దోషాస్పదము కాదు. నామమాత్రములైన అంతర్భేదము లున్నను నష్టములేదు. వివిధభిన్నమైన జాతుల నేకీభవింపుడని ప్రోత్సహించుట మా యధికారమునకు మీరినపని. నవీనవిద్యలు జనులలో గాఢముగ ప్రచారము కానిదే నవీన సంస్కారములు సఫలము కానేరవేమో! ప్రతిభ, సామర్థ్యముగలవారు విద్యా ప్రచారమునకు బూనుటయే ముఖ్యాతిముఖ్యమని మేము భావించుచున్నాము. ఏదియైనను యథార్థముగ నది వీరశైవుల యౌన్నత్యమునకు కారణ మగునని మాకు తోచినచో సంతోషపూర్వకముగ బ్రచారము నభిలషింతుము. —సంపాదకుడు.

# వీరశైవ ప్రపంచమునకు విజ్ఞప్తి

శ్రీ బూసా వీరయ్యగారు

వీరశైవమత కల్పవృక్షము, యుగయుగములయందు వేర్వేరు నామముల పంచాచార్యులను బీజములచే నుద్భవించి, మత గురువులను శాఖలు, భక్తులను పత్రములు, పండితులను పుష్పములు, మాహేశ్వరులను ఫలములుగలిగి మతగురువుల బోధామృత మను నీతిచే పోషింపబడి యుత్కృష్టవైభవముల నలరారు విషయ మెల్ల వీరశైవులకు విదితమే. ఐనను వీరశైవప్రపంచమునకు దెలుపుకొనునంతటి శక్తి లేకున్నను నా యంతరాత్మయందు మతాభిమాన మను చిన్న కిరణము ప్రవేశించి ప్రోత్సహించుచున్నందున నెట్టకేల కీ విజ్ఞప్తి జేయ బూనుకొంటిని.

వీరశైవ మతకల్పవృక్ష మిట్లతిశోభ గలిగి ప్రకాశించుచూ రానురాను నేటి కలియుగమున మతగురువుల బోధామృత సలిలము చాలినంతలేక వృక్షము క్షీణింపనుండె. పాదపమే క్షీణించుచో బత్ర ఫల పుష్పాదులమాట చెప్పనక్కరయే లేదు. అట్టిసమయమున "పేదవానికి పెన్నిధివోలె" జలమును కల్పించి భూజమును పెంచదలచి బద్ధ కంకణులై పాటుపడుచున్న, వేద కావ్యస్మృతితీర్థ, సాహిత్యవిశారద, ధర్మాచార్య, విద్యానిధి, విద్యారత్న బిరుదాంకితు లగు శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారి ప్రయత్నములు బాలబాలిక వయోవృద్ధ పండిత పామరజనంబు లెల్లరకు దెలిసియేయున్నవి. అట్టి పండితులు ధర్మపాదపమునకు వీరశైవ గురుకుల మను పాదును కల్పించి వీరశైవవాఙ్మయము లను బావులనుండి 'విభూతి' పత్రిక యను పంటకాలువ ద్వారా సలిలమును సాగించి యెండి పోనున్న చెట్టును చిగురింపజేసిరి. ఇట్లు ప్రవహింపజేయుచున్న పంటకాలువ యను 'విభూతి'ని, సేవించి చందాదారులుగను, సహాయకులుగను, పోషకులుగను, రాజపోషకులుగను, మహారాజ పోషకులుగను జేరి నిరాటంకముగా పత్రిక కొనసాగునటుల ప్రయత్నించుటకు ప్రతి వీరశైవుని కర్తవ్యమై యుండగా "మేఘములు గర్జన సహితముగా వర్షించుటకు సిద్ధమయ్యు, వాయువు సహాయమున వెనుకంజ వేసినట్లు" గత వత్సరములలో (పత్రిక యుద్భవించక పూర్వము) ద్రవ్యవాగ్దానములు చేసిన మహానుభావులు సంవత్సరముల కొద్ది తమ వాగ్దానములను చెల్లించకయుండుట కడు శోచనీయ మనక తప్పదు. చెల్లించిన మహనీయుల నామము లెప్పటి కప్పుడు పత్రికాముఖమున విశద మగుచునే యున్నవి. తమ తమ వాగ్దానము లీ సరికి సంపూర్ణముగా నిచ్చుచో నిప్పటికే వైభవములు గలిగి విరాజిల్లుచున్న పత్రికామతల్లి మరింత శృంగారమును దాల్చియే యుండెడిది.

"ఋణశేషము వ్రణశేషము నుంచకూడ" దని పెద్దలు సెలవిచ్చి యున్నారు.

కాఁబట్టి తా మెల్లరు తమ తమ వాగ్దానములు త్వరలో నందింపఁజేసి సహాయకులుగను, చందాదారులుగను చేరక యితరులను చేర్పించక బీదలమని, అక్షరజ్ఞానము లేదని, అర్థజ్ఞానములేదని, పత్రికను సేవించక యేవో సాకులు చెప్పుచుఁ గాలమును వ్యర్థపుచ్చిన కల్పవృక్షమున ఫలములనుగాంచి యనుభవింపఁ జాలుదుమా? వీరశైవమత కష్టము లీడేరునా? యితరమతీయుల హేలనములు తప్పునా? పత్రికాసంస్థ చిరస్థాయియై నిలువ నేర్చునా? ఇహపరములయందు సౌఖ్యములు చేకూరునా? ధనికులుగాని, ధనికులు కాని వారుకాని కార్యసాధనకు గడంగుచోఁ గోట్లకొద్ది మార్గములు గోచరింప గలవు. చిన్ని యుదాహరణ: గృహకృత్యముల యందు తమ కగు ఖర్చులో దినమున కొకటింటికి రు 0-0-1½ చొ॥ హెచ్చించి నిల్వఫండు చేయుచో సంవత్సరమునకు రు 2-13-0 లు అగునుగదా! పత్రిక నిరాటంకముగా వచ్చునుగదా! "యత్నేచ కార్యసిద్ధి స్స్యాత్" యనునట్లిటులే యత్నించిన "వెలస్వల్పము ఫలమధికమ"న్న ట్లెన్ని యుత్కృష్టగ్రంథములనైనను సంపాదింప గలుగుదుము. ఎన్ని సంస్థలనైనను నిలువబెట్ట గలఁగుదుము. బాలబాలికలకు విద్యగఱపు పాఠశాల లెన్నియేని స్థాపింపఁగలుఁగుదుము. వేయేల? సంఘములు నెలకొల్పి యైకమత్యముగలిగి మంచియాచరణ జరుపుచుండిన నెంత ఘనకార్యములనైనను జేయగలుఁగుదుము. తామెల్లరొకపర్యాయము శాంతమనస్కులై యోజించి మతము వైపునకు తమ దృష్టిని ప్రసాదింపుడి. బసవేశ్వరాది మహామహులగు పూర్వులు మతోద్ధరణకై యెంత పాటువడిరో గ్రంథములు జెప్పుటలేదా? భక్తమాహేశ్వరులు సంఘీభావముగలిగి యెంతటి మహిమలు సంపాదించిరో వినుటలేదా?

వీరశైవాగ్రేసరులారా! "తోడునులేక కార్యములు ధూర్జటికైనను సాగవ" నునట్లితరుల సహాయములేకనే పనులుచేయుటయు దుర్లభమే యగును. ఒకానొకప్పు డొక్కొక్క గృహమునందు జరుగు శుభకార్యములపట్ల యజమానులొక్కొక్కరే పాల్గొని కార్యములు కొనసాగించుచుండిరా? యజమానుల యాజ్ఞానుసార మెల్ల బాంధవుల సహాయముండియు కార్యములు నెఱవేరుట కష్టమైనపుడు, వీరశైవప్రపంచమున వీరశైవమతకల్ప వృక్షమును వృద్ధిజేయ నెంచి పాటువడు కార్య మెంతసుఖమో సూక్ష్మబుద్ధిని యోజింపఁ దమకుదామే దెలియనగును. "సిరిరా మోకాలొడ్డువా రుందురా" యను లోకసామ్యము ననుసరించి తరుణమును బోగొట్టుకొనక దీనదశయందు గతిగానకల్లాడుచున్న యీమతమునకు త్రోవజూప నమకట్టి యంధకారమును విడదీయు నరుణోదయ కిరణములవలె ప్రత్యక్షమై పాటుపడుచున్న శ్రీ వీరభద్ర శర్మగారి ప్రయత్నముల "కనలంబున కాజ్యమనిపోలె", వీరశైవ సోదరులెల్లరు సహాయభూతులగుదు రను నాయీ యల్పవిజ్ఞప్తిని చిత్తగింప గోరుచున్నాను.

మఱియు తమ తమ బాలబాలికలకు సైతము విద్యలు గఱపించుచు, సకాలమునకు దీక్షల నిప్పించి సదాచారములు గలిగి, నిష్ఠాగరిష్ఠులై విజ్ఞాన మభివృద్ధిజేసి వీరశైవమత కల్ప వృక్షమును బోషించి ఫలములను గాంచి సుఖులై మహిమ లార్జించి యష్టైశ్వర్యములఁ

బొంది, దురభిప్రాయముల బారదోలి సదభిప్రాయములకే తమ హృదయ సీమలయందు తావొసంగి యీశ్వరుని కృపకు పాత్రులౌదు రని నిరీక్షించుచున్నాను.

సీ॥ అజ్ఞానమును వీడి ♦ నైకమత్యముగల్గి, సంఘముల్ నిలుపుడీ ♦ సరసులార!
యుత్కృష్టమున చిత్త ♦ ముంచి 'విభూతికి', సేవజేయుడి ! ♦ వసిద్ధులార!
వీరశైవచరిత్ర ♦ వివరించు పత్రికన్, వేగంబె గొనుడి యో ♦ వేత్తలార!
కార్యసాధనముకై ♦ కష్టంబు లెంచక సద్గురుగను సత్య ♦ సంధులార!
గీ॥ నాదు విజ్ఞప్తి మీ మది ♦ న్నాటజేసి, విరివిగను పాటుపడినచో ♦ వీరశైవ
కల్పవృక్షంబు నతి శీఘ్ర ♦ కాలమునను, ఫలమునిచ్చును శివుకృపన్ ♦ భవ్యులార!*

* ఈ వ్యాసకర్తలైన శ్రీ బూసా వీరయ్యగారు సాత్త్వికులు, మతిసేవయందు మిక్కిలి ప్రేమ గలవారు. గతమాసమున కృష్ణా గుంటూరు జిల్లాలలో సంచరించి 'విభూతి'కి ననేకులగు క్రొత్త చందాదారులను సంపాదించిన యభిమానఘనులు. వీరికి పరశివుడభిమతముల ననుగ్రహించుగాక! "విభూతి" పాఠకులలో ఒక పదిమంది యేనియు ఇట్టి సత్కార్యమునకు బూనుచో నిరాతంకముగ సాగగల దని యాశించుచున్నాము.
—సంపాదకుడు.



# అహింస: ప్రేమ

శ్రీ కుందెము నీలకంఠేశ్వరరావుగారు

సీ. సేద్యవృత్తికి మేలుచేసెడి పశువులన్, జంపి భక్షించుట చనునె మీకు?
సర్వోపకారంబు సల్పు మేషాదులఁ, జంపి భక్షించుట చనునె మీకు?
అన్యోన్యముగఁ బ్రేమ నలరారు పక్షులఁ, జంపి భక్షించుట చనునె మీకు?
జలపారిశుద్ధ్యంబు సల్పు మీనంబులఁ, జంపి భక్షించుట చనునె మీకు?
గీ. సత్కృపాకలితుం డగు సర్వనాథు, సృష్టి నీరీతిఁ జెఱచుటచేత మీకు
నిహపరంబుల సౌఖ్య మింకెట్లు గలుగు? దేవుఁ డెట్లు మెచ్చు? మహానుభావులార!
క. పరకష్టమె తన కష్టము, పరసుఖమే తన సుఖంబు, పరదారిద్ర్యం
బరయఁగఁ దనదే యని మదిఁ, బరికించెడి వాఁడె మర్త్యవర్యుం డిలలో!
గీ. బీదవారినెల్ల నాదరమ్మునఁ జూచి, వారి కష్టముల నివారణంబు
సేయునట్టి వృత్తి సేయించు ధనికుడే, ధనికుఁడనుచుఁ జెప్పఁదగును భువిని.

*　　*　　*　　*

సీ. ప్రేమచేతనుగాదె విభ్రాజమానుఁడౌ రవికాంతినిచ్చుట భువనమునకు?
ప్రేమచేతనుగాదె సోముండు నిశలందు వెన్నెలగాయుట విశ్వమునకు?
ప్రేమచేతనుగాదె విమలసమీరంబు వీచుచునుండుట విష్టపమున?
ప్రేమచేతనుగాదె ధూమయోని సతంబు వర్షించుచుండుట వసుధయందు?
అట్టివారిప్రేమ యణుమాత్రమైనను వెలితి గలిగెనేని విశ్వమెల్ల
నర్ధనిమిషమునకె యంతంబు నొందదా? జగతి ప్రేమరసమె శాశ్వతమ్ము.




సుదర్శనం (మాసపత్రిక):—సంపాదకులు భద్రగిరి రామావతారం బి. ఎ. గారు, చాత్తాద వైష్ణవయువజనసమితి, విజయనగరం. సంవత్సర చందా 0-4-0 అట! ఈ తృతీయవార్షికోత్సవ సంచికలో 52 పేజీలును, అనేకచిత్రములును కలవు. దీని వెల 0-2-0 మాత్రమే - ఈ పత్రిక స్వసంఘోద్ధరణమునకై యథాశక్తి మిక్కిలిగా పాటు పడుచున్నది. వ్యాసములు కూడా కొన్ని సమర్థముగా నున్నవి. సంపాదకుల పరిశ్రమ, ప్రచారసమ్ముఖత ప్రశస్తమైనది. మతపత్రికల కుండెడు సహజమైన బీదతనము దీని కెక్కువగా కలదు. చాత్తాద వైష్ణవులు శ్రద్ధ దీసికొనినచో సులభమైన వెలగల ఈ పత్రికను వేలసంఖ్యలో ప్రచారము గావింపవచ్చును.

శైవమత పత్రికాశిక (మాసపత్రిక) సంపాదకులు, వటుక భైరవమూర్తిగారు, బి. ఎ. బెజవాడ సంవత్సర చందా ఒకరూపాయి, పుటలు ౧౬, రఫ్:— ఈ పత్రిక సంచికలు కొన్నిటిని చూచితిమి. పీఠ సమాచారములు, నివేదికలు, ప్రచారవార్తలు మున్నగు విషయములు కలవు. మతధర్మ ప్రతిపాదకములైన వ్యాసములుగూడా ప్రకటింపబడవలె నని నిరీక్షింతుము. పీఠవివాదములు చెలరేగినందువలన నేమో పత్రికా ప్రయత్నము సమర్థముగాలేదు. మేమీ పత్రికాభివృద్ధిని గోరుచున్నాము.

భూమండలదభవిష్య:—కర్త, బ్ర॥ శ్రీ సిద్ధాంతి రుద్రారాధ్యశాస్త్రిగారు, మహగాంవ్, జిల్లా గుల్బర్గా (నిజాం) పుటలు ౧౨౬, రఫ్ పాకెటు సైజు. వెల తెలియదు. ప్రస్తుతము జరుగుచున్న మహా ఘోరసంగ్రామమువలన ప్రపంచ పరిస్థితు లేవిధముగ నుండగలవో యని ధీమంతు లాలోచించుచున్నారు. ఈ పొత్తమున సృష్టి, స్థితి, గ్రహగతి, ప్రళయసామగ్రి, ధర్మనీతిక్రాంతి, భవిష్యత్తు, భగవదవతారము, అను విషయములు శాస్త్రాధారములతోడను పరిస్థితి వివేకముతోడను వ్రాయబడినవి. కుతూహలము గలిగించు పుస్తకము. ఇది కన్నడ భాషలో గలదు.

---

## వ్యాసకర్తలకు మనవి

భాష, మతము, ధర్మము, నీతి, విజ్ఞానము మున్నగు విషయములకు సంబంధించిన గద్య వ్యాసములు సులభశైలిని ప్రార్థితములు. "విభూతి" సైజు చిన్న కాగితములలో కాగితమున కొక ప్రక్కమాత్రమే విడివిడిగా వ్రాయబడవలెను. పేరాలు అనవసరముగా విడిచిపెట్టుట గాని, లేకుండ వ్రాయుటగాని ఉత్తమపద్ధతి కాదు. పద్యవ్యాసముల నిక మీద చాల ముఖ్యముగా నున్నచో మాత్రమే ప్రకటింపగలము. అవియు క్లుప్తముగా నుండవలెను. వ్యాసముల మధ్యమున వచ్చు పద్యములు శ్లోకములు మున్నగునవి కాగితము నడుమ చరణచరణములుగా వ్రాయవలెను. ప్రకటింపరాని వ్యాసములను తిరిగి కోరువారు ముక్కాని (ఎనిమిది పాయిాల) పోస్టుచీట్ల నంపవలెను. సంపాదకుని కష్టములను తమవిగా భావించి పత్రిక రమణీయముగ నుండునట్లు పరిశ్రమింపగలందులకై మనవి.

## స హా య కు లు

| | |
|---|---|
| శ్రీ శ్రీ అవధూత బసవరాజుగారు | నూజివీడు |
| ,, వే. బసవయ్యస్వామిగారు | శ్రీశైలము |
| ,, అవధూత పర్వతాలయ్యగారు | రంగాపురం |
| ,, చిలువూరు శంభయ్యగారు | చిలువూరు |
| ,, చదువుల బసవశంకరయ్యగారు | నరసాపురం |
| ,, చుక్కా పాపయ్యగారు | వల్లభాపురం |
| ,, పాలకొల్లు చెన్నబసవయ్యగారు | కనగాల |
| ,, కుంచాల నాగయ్యగారు | ,, |
| ,, కుంకులగుంట బసవయ్యగారు | నరసరావుపేట |
| ,, ఎస్. సోమేశ్వరరావుగారు, హైకోర్టువకీలు | వికారాబాదు |
| ,, రావికోటిమఠం వీరభద్రయ్యగారు | హైదరాబాదు |
| ,, పట్నంశెట్టి మల్లప్పగారు | మెదక్ |
| ,, దొడ్డ కోటయ్యగారి వీరన్నగారు | నల్లగొండ |



Regd.No. M. 4122.
H. E. H. Nizam's 165.

"VIBHUTI"
SECUNDERABAD Dn.

Editor:—PANDIT C. M. VEERABHADRA SHARMA.

## ప్రతిష్ఠాపకులు

| | |
|---|---|
| శ్రీ జగద్గురు శివానంద రాజదేశీకేంద్ర మహాస్వాములవారు | రంభాపురి |
| శ్రీ జగద్గురు సిద్ధేశ్వర శివాచార్యమహాస్వాములవారు | ఉజ్జయిని |
| శ్రీ జగద్గురు పంచాక్షర శివాచార్య మహాస్వాములవారు | కాశీ |
| శ్రీ జగద్గురు వాగీశ పండితారాధ్య మహాస్వాములవారు | గుంతకల్లు |
| మ. బ్రి. శ్రీ చెన్నవీర శివాచార్య సావిర దేవర స్వాములవారు | బిచ్చాలి |
| మ. బ్రి. శ్రీ ముమ్మడి సిద్ధశంభుస్వాములవారు | చేబ్రోలు |

## మహారాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ శ్రీ ఆదిలక్ష్మమ్మదేవి మహారాణిగారు | గద్వాల సంస్థానము |
| ,, జి. హెచ్. వీరన్నగారు, గుబ్బి | బెంగుళూరు |
| ,, చుక్కా శనగల కోటివీరయ్యగారు | కొరరిపాడు |
| ,, నేలవల్లి కోటయ్యగారు | దుగ్గిరాల |
| ,, రాచంశెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యగార్లు | ,, |
| ,, నాగూరు మల్లప్ప షావుకారుగారు | నంద్యాల |
| ,, ఆరాధ్యుల మూటయ్యగారు | చామర్లకోట |

## రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ శ్రీ అందెల కోటివీరయ్యగారు | చేబ్రోలు |
| ,, అందెల కోటినాగయ్యగారు | ,, |
| ,, సిద్దాని అంకన్నగారు మ్యు. కమీషనర్ | గుడివాడ |
| ,, శరణార్థి గౌరయ్యగారు బి. ఎ. సబ్ రిజిష్ట్రార్ | గిద్దలూరు |
| ,, ఈదర వేంకటరావుపంతులుగారు (వేంకటరాం అండ్ కో) | ఏలూరు |
| ,, దేవిశెట్టి అమ్మన్నగారు | నిడదవోలు |
| ,, ధూళాధూళి వీరయ్యగారు | ,, |
| ,, రుద్రిశెట్టి గుండయ్యగారు | చెన్నూరు |
| ,, పెద్దశెట్టి శాంతయ్యగారు | ,, |
| ,, సాయం సిద్ధరామప్పగారు | శంషాబాదు |
| ,, డా. కె. రుద్రప్పగారు, ఎల్. ఎం. ఎస్ | హైదరాబాద్ |
| ,, ఏదుల రాజయ్యగారు | ,, |
| ,, దండె చిన వీరప్పగారు | గద్వాల |
| ,, మాడపు శంకరప్పగారు | సికిందరాబాదు |

Printed by K. L. Narasayya, at the Andhra Grandhalaya Press, Bezwada.